ఓమ్

# షడ్వర్గబలము




రచయిత:

జ్యోతిష విద్యాభూషణ

శ్రీ వాడ్రేవు సూర్యనారాయణమూర్తి, బి. ఏ,

రాజమండ్రి.



ప్రకాశకులు:

కొండపల్లి షోరూం,

ప్రో: కొండపల్లి సుబ్బారావు & సన్స్,

మెయిన్ రోడ్, రాజమండ్రి - 533 101.

1987




వెల :

రు. 8-00

# ఇష్టదైవ ప్రార్థన

శ్లో॥ యోగిధ్యేయం విమల విశద ప్రస్ఫురద్రమ్యకాన్తిం
శాంతం బుద్ధం సురపరివృఢైరానతై రర్చ్యమానమ్
కారుణ్యార్ద్రం హసితసుషమామోదితాశేషవిశ్వం
సాక్షాత్తత్త్వప్రతికృతిముమా సంయుతం నౌమిశంభుమ్.

## అంకితము

నా ఇష్టదైవములగు
శ్రీ పార్వతీ పరమేశ్వరులకు
ఈ పుస్తకమును
అంకిత మొనర్చుచున్నాను.

సూర్యనారాయణమూర్తి



గ్రంథకర్త :

జ్యోతిష విద్యాభూషణ

శ్రీ వాడ్రేవు సూర్యనారాయణమూర్తిగారు B. A.

వారి సతీమణి వాడ్రేవు వెంకటరత్నమ్మగారు

ఓమ్

శ్రీ పార్వతీపరమేశ్వరాభ్యాం నమః

# షడ్వర్గబలము

---

షడ్వర్గలని సామాన్యముగా జ్యోతిషమున వాడబడుచున్నది. జాతకములు వ్రాయువారు జాతక ప్రారంభమున షడ్వర్గవిభాగమును చేసి వదలివేయుటయేగాని, అనగా సంజ్ఞలక్రింద వ్రాయుటయే గాని, వాటి యుపయోగము తెలిపి వాటివలన ఫలితములను వ్రాయుట కానరాదు. ఇది వారికి వాటి యుపయోగము తెలియకయే యని చెప్పవచ్చును. ఇది చాలాకాలమునుంచి వచ్చుచున్నది. జాతకుడు ఏనాంశమందు, ఏద్వాదశాంశమందు, ఏత్రింశాంశమందు ఏద్రేక్కాణమునందు పుట్టెనో అదిమాత్రము కట్టి "ఏవం షడ్వర్గ వేళాయాం" అనివ్రాసి అచ్చటనే వాటివిషయమునువదలివేసి వాటికి సంబంధించిన ఫలితములను వ్రాయకపోవుటనుబట్టి చూడగా ఇవి ఎట్లు కట్టవలెనో మాత్రము వారికి తెలియునేగాని, వీటి యుప యోగము మాత్రము తెలియదనుట స్పష్టము. అనేకమంది అను శ్రుతముగా వ్రాయు జాతకములనుబట్టి ఇది గోచరించుచున్నవి.

పరాశరమతమున షడ్వర్గము చెప్పబడినది, 1 రాశి, (గృహము) 2 హోర, 3 ద్రేక్కాణము, 4 నవాంశము, 5 ద్వాద శాంశము 6 త్రిశాంశము. ఇది షడ్వర్గము ఇది ఒకపద్ధతి. దీనిని వరాహమిహిరాదులు కూడ చెప్పియున్నారు. కాని వారు దానిని కేవలము సంజ్ఞక్రిందనే చెప్పినారు గాని ప్రత్యేకముగ బలముక్రింద చెప్పలేదు. గ్రహ రాశి సంజ్ఞలను చెప్పి అందులో హోరాదులను కూడ నొక సంజ్ఞక్రింద చెప్పకొనియున్నారు. వాటికి వారు ఫలిత విషయమున ప్రాముఖ్యము నిచ్చినట్లు తోచదు. ఇందులకు —

శ్లో. ద్రేక్కాణహోరా నవభాగసంజ్ఞాః
త్రింశాంశక ద్వాదశసంజ్ఞి తాశ్చ।
క్షేత్రం చ యద్యస్య స తస్య వర్గో
హోరేతి లగ్నం భవనస్య చార్ధమ్ ॥

ద్రేక్కాణ = రాశితృతీయాంశము, హోరా = రాశ్యర్ధము, నవభాగ = రాశియందలి తొమ్మిదవభాగము, త్రింశాంశక = ముప్పదియవభాగము, ద్వాదశసంజ్ఞిత = పండ్రెండవభాగము, క్షేత్రం చ = రాశియును షడ్వర్గ అనబడును. యత్ — ఏరాశి, యస్య — ఏగ్రహ సంబంధమయినదో, సః — ఆరాశి, తస్య = ఆ గ్రహముయొక్క, వర్గః = వర్గమగుచున్నది. లగ్నంచ = లగ్నమున్ను, భవనస్యార్ధంచ = రాశిలో సగమున్ను, హోరేతి = హోరయని చెప్పబడినది.

బృహజ్జాతక మంతను పరీక్షించి చూచినచో వరాహమిహిరుడు ఈ షడ్వర్గములను రాజయోగములకు ఉపయోగించినట్లు కనపించదు. వీటివలన గలుగు బలాబలములను కూడ గ్రహములకు నిర్ణయించలేదు. కాని ఈయన అనేకరడిములగు యోగములను యీ షడ్వర్గులనుబట్టి వ్రాసినాడు. జన్మకాల లక్షణాధ్యాయమునందును. చంద్రయోగాధ్యాయము నందును, దృష్టి ఫలాధ్యాయ మందును, ఆశ్రయయోగాధ్యాయ, ప్రకీర్ణాధ్యాయ, స్త్రీనైర్యాణిక, ద్రేక్కాణాధ్యాయములందును ఈషడ్వర్గులను విరివిగా వాడినను ప్రత్యేకముగా పారాశర్యములోవలె రాజయోగములు నిర్ణయించుటకు మాత్రము వాడలేదు. జీవితములోని కొన్నిఘట్టముల సాధారణ లక్షణములను (General characteries to certain incidents in life) తెలుసుకొనుటకు వాటిని ఉపయోగించినాడు. జ్యోతిష్కులకు వీటి ప్రాముఖ్యము వరాహమిహిరాదుల వ్రాతలనుబట్టి జాతకుని యోగావయోగములు నిర్ణయించుటకు అంతతోడ్పడుటలేదు. కాని వరాహ

మిహిరాదులు తీసుకున్నట్లు కేవలము ఇవి సంజ్ఞలుగా మాత్రమే నిర్ణ యించుకొని వీని యుపయోగ మింతకంటె లేదనుకొనుట పరాశర మతస్థుల యభిప్రాయమైనట్లు కాన్పించదు. అందువలననే పరాశర మతస్థులు షడ్వర్గమని కేవలము సంజ్ఞామాత్రముగా వ్యవహరింపక షడ్వర్గబలమని వ్యవహరించుచున్నారు. కావున యోగావయోగ ములను నిర్ణయించుటకు ఈ షడ్వర్గబలము ఉపయోగించునని వారి యభిప్రాయమైనట్లు స్పష్టమగుచున్నది. ఈ విషయమ్లో పరాశర మతస్థుడగు కాళిదాసు సప్తవర్గబలమను పేరుతో గణితరీత్యా ప్రతి గ్రహమునకు బలము నిర్ణయించినాడు. ఈయన సప్తాంశమునుకూడా చేర్చి సప్తవర్గబలమని పేర్కొనినాడు. రూప, లిప్త, విలిప్తలలోకి మార్చి ప్రతిగ్రహబలమును చక్కగాతీసి వాటివలన యోగ మెంత ఇచ్చును అను విషయమును నిర్ణయించుటచేత ఇది వరాహమిహి రాదుల మతములకంటె చాలా ప్రశంసనీయమయినది. ఇది ఉత్తర కాలామృతమున ద్వితీయఖండమున చక్కగా చెప్పబడినది. ఈ గణితాగతబలము యోగావయోగముల కెంతవరకు ఉపయోగ పడును, ఆచరణలో(applicationలో) ఫలములనుసాధించుటకు ఎట్లు దీనిని ఉపయోగించవలెను. అను విషయములను తరువాతచెప్పెదను.

మరికొందరు షడ్వర్గబలమనగా (1) క్షేత్రము, (2) ఉచ్చ (3) మూలత్రికోణము (4) మిత్రత్వము (5) దృష్టి, (6) అధిమిత్ర త్వము అని చెప్పినారు. మరికొందరుమిత్రత్వము అధిమిత్రత్వములకు బదులు అవస్థలు, చేష్టలు అని చెప్పుచున్నారు. వరాహమిహిరాదుల మతముకంటెను, కాళిదాసాదుల మతముకంటెను ఈ మూడవమతమే సరియనది. వాడుకలోను అనుభవములోను కూడ నున్నది. పద్ధతి సరియైనదయినను మనవారు వీటిని ఉపయోగించుటలో తప్పు మార్గమును త్రొక్కుచుండుటచేత వీటి ఉపయోగము వీరికంతగా నుండుట లేదు. ఈవిషయము ముందు చర్చించెదను.

జైమిని మహర్షి మాత్రము పై మతముల యభిప్రాయము నామోదించలేదు. ఈయన పై మతస్థులవలె లగ్నమును విభజించి షడ్వర్గులక్రింద చేయలేదు. లేక రెండవ మతస్థులవలె లగ్నము నకున్ను, గ్రహాములకున్ను గల సంబంధమునుబట్టి షడ్వర్గము నేర్పరుపలేదు. లగ్నములను వేరువేరు రకములుగా మార్చి వాటిని బట్టి పారాశర్యమున లగ్నమునుబట్టివలె యోగములను చెప్పినాడు. ఉ॥ సూ॥ "జన్మకాల ఘటికాసు ఏకదృష్టాసు రాజానః", ఈయనచే జన్మలగ్న, ఘటికాలగ్న, హోరాలగ్న (ఈహోర పారాశర్యము లోని హోరవంటిదికాదు.) కారకాంశలగ్న, ఆరూఢ, లగ్నము లుగా విభజింపబడి ఆయాలగ్నములకు యోగములు చక్కగా చెప్ప బడినవి. ఈలగ్నములు కట్టుట నేను వ్రాసిన జాతకనారాయణీయము మొదటిభాగమున వివరింపబడినది. జైమిని మహర్షి కాని, పరాశర మతస్థులుకాని షడ్వర్గు వ్రాసినప్పుడు అది కేవలము యోగవిషయ మునకు మాత్రము యుపయోగపడునని భావించి వ్రాసినట్లు తోచు చున్నది. కాని, జైమిని తనలగ్ననిర్ణయము యోగవిషయమునకే కాక ఆయుర్నిర్ణయమునకుకూడా నుపయోగించినాడు. ఈయన రాసులకున్ను గ్రహాములకున్ను ఉన్న బలమును వర్గులుగా (GrouP system) గా రాసులను విడదీసి దానినిబట్టి నిర్ణయించినాడు. ఈ పద్ధతి ద్వాదశభావ నిర్ణయమునకు అందు రాజయోగ ఆయుర్దాయ నిర్ణయములకు అత్యంతము ఖ్యముగా తీసికొనియున్నాడు. ఉదాహరణకు - పంౘ్రెండు రాసులనునాలుగువర్గులు (GrouPs) గా విడదీసినాడు. చర, స్థిర, ద్విస్వభావరాసులను మేషాదిగా లెక్కించిన 4 వర్గులు వచ్చును. ఒకవర్గులోనున్న గ్రహాము అదేవర్గులోనున్న గ్రహామునకు తనబలమును (Influence)ను ఇచ్చి యోగావయోగ ములను ఇచ్చుటకు పనికిరాదు. అట్లే అదేవర్గులోనున్న గ్రహామును చూడదు. పారాశర్యమున అట్లుకాదు. శని మేషమున నున్నచో

అదేవర్గులో ద్విస్వభావ రాశియగు మిథునమును, అందున్న గ్రహము లను మూడవ దృష్టితో చూచును. కాని జైమినిమతము ప్రకారము అట్లు చూడదు. అతని మతము ప్రకారము వృషభములో నున్న ఏగ్రహమయినను కర్కాటమును అందున్న గ్రహములను చూచును. ఇందుకు కారణము మిథునమువరకును ఒక వర్గము అయి కర్కాటకము నుంచి రెండవ వర్గము అగునుగాన మొదటి వర్గములోని గ్రహము రెండవవర్గములోని గ్రహమును చూచునుగాన ఒకరికొకరుపరస్పరము బలమును ఇచ్చువారగుదురు. వరాహమిహిరాదులు షడ్వర్గును కేవలము సంజ్ఞలుగా తీసుకొన్నను స్వక్షేత్రఉచ్చ. నీచ, మూలత్రికోణము ములను,మిత్రత్వశత్రుత్వములనుకూడా యోగనిర్ణయములోబాహాటముగా వాడినారు. ఆయుర్విషయమున, యోగములకంటెను ఎక్కువగా వాడినారు. వీరు ఉచ్చనీచాదులనే తీసుకొని వాటివలన బలనిర్ణయము చేసినారేకాని పరాశరాదులవలె షడ్వర్గబలముపై ఆధారపడలేదు.

## వరాహమిహిరాదుల మతము

జన్మకాల లక్షణాధ్యాయమున "లగ్ననవాంసపతుల్యా తనుస్స్యాద్వీర్యయుత గ్రహతుల్యతనుర్వా॥"అనుశ్లోకమును నవాంశ లగ్నమును గురించి వరాహమిహిరుడు చక్కగా చెప్పినాడు.

శ్లో॥ కం దృక్ శ్రోత్రనసాకపోలహనవో వక్త్రం చ హోరాదయః
తే కంఘాంసకబాహుపార్శ్వహృదయక్రోడాని నాభి స్తతః॥
వస్తిశ్శిశ్నగుదే తతశ్చ వృషణావూరూ తతో జానునీ
జంఘేంఘ్రీత్యుభయత్ర వామ ముదితైః ద్రేక్కాణభాగైస్త్రిధా॥

సర్వాంగములు, వాటి లక్షణములు, వాటియందు కలుగు రోగవిషయములు-వీటిని ద్రేక్కాణమునుపట్టి చక్కగా వరాహమిహిరుడు చెప్పియున్నాడు. దీనినిబట్టి శరీర విభాగమును కూడ

చేసియున్నాడు. రాశిశీలాధ్యాయమున ఏగ్రహ మేరాశియందుండిన ఎట్టి లక్షణములు కలవాడగునను విషయము చెప్పియున్నాడు. ఇచ్చటజన్మలగ్న రాశిని బట్టి లక్షణములను చెప్పలేదు. ఇది గమనించ దగిన విషయము. అట్లే దృష్టిఫలాధ్యాయమున ఒకగ్రహము నింకొక గ్రహమును చూచునప్పుడుండు లక్షణములున్ను, ఏ రాశియందు ఏగ్రహముండగా ఇతర గ్రహములు చూచిన ఎట్టి ఫలితములు గలుగునను విషయమునున్ను వ్రాసినాడు. ఇంకను —

శ్లో॥ హోరేశర్క్ష దళాశ్రితైశ్శుభకరో దృష్టశ్శశీ తద్గతః
త్ర్యంశే తత్పతిభిస్సుహృద్భవన గైర్వా వీక్షితశ్శస్యతే॥
యత్రోక్తం ప్రతిరాశివీక్షణఫలం దద్ద్వాదశాంశే స్మృతం
సూర్యాద్యైరవలోకితే శశిని విజ్ఞేయం నవాంశేష్వతః॥

హోరేశ = హోరాధిపతియొక్క, ఋక్ష దళ = రాశ్యర్ధమును, ఆశ్రితైః = పొందియున్న గ్రహములచేత, తద్గతః = ఆహోరను పొందియున్న, శశీ = చంద్రుడు, దృష్టః = చూడబడెనేని, శుభకరః= శుభకరుడగును. అనగా ఏ రాశియందైనను సూర్యహోరయం దున్న చంద్రుడు ఏరాశియందైన సూర్యహోరయందున్న గ్రహము లచే చూడబడెనేని శుభకరుడగును. అట్లే చంద్రహోరయందున్న చంద్రుడు ఏరాసియందైనను చంద్రహోరయందున్న గ్రహములచే చూడబడినచో శుభకరుడగును. అట్లుకాక సూర్యహోరయందున్న చంద్రుడు, చంద్రహోరయందున్న ఇతరగ్రహములచే చూడబడినచో అశుభకరుడగుననియును, అట్లే చంద్రహోరయందున్న చంద్రుడు, సూర్యహోరయందున్న ఇతర గ్రహములచే చూడబడినచో అశుభకరరుడగుననియును చెప్పబడినది. జననము లగ్నమును ఏహోర యందు అగునో ఆహోరయందున్న (ఏరాశియందైననుసరే) ఇతర గ్రహములు జన్మలగ్నమును చూచినచో జాతకునకు శుభకర

మనియును, ఇతర హోరయందున్న గ్రహములు చూచినచో అశుభ కరుడనియును చెప్పబడినది. త్ర్యం శే తత్పతిభిః=ఏ రాశియం దైనను ఏ ద్రేక్కాణమందు చంద్రుడుండునో ఆ ద్రేక్కాణాధిపతిచేత చంద్రుడు చూడబడినయెడల, శస్యతే=శుభకరుడగును. 'పతిభిః' అని బహువచన ప్రయోగమువలన నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశలకు కూడ పైవిధముగా చూచుకొనవలెనని గ్రంథకర్త యభిప్రాయ మయినట్లు ఊహించవలెను. ఇంకను "ద్రేక్కాణాంశక పైర్వా ప్రాయ స్సామ్యైశ్శుభం నాన్యైః" అని చెప్పబడుటచేత ఈ ద్రేక్కాణాధిపతులు శుభగ్రహములై చూచినచో శుభప్రదమనియును, వీరు పాపులై చూచినచో సామాన్యమనియును గ్రహించవలెను. సుహృద్భవనగైః = మిత్రక్షేత్రగ్రహముల చేతనైనను. ("వా" శబ్దముపయోగించుటచేత కొందరు స్వక్షేత్ర గ్రహములచేతనైన నని కూడా అర్థము చెప్పుచున్నారు.) వీక్షితః = చూడబడిన చంద్రుడు, శస్యతే = శుభకరుడగుచున్నాడు. అనగా శత్రుక్షేత్రగత గ్రహములచే చూడబడినచో మంచివాడుకాడని తెలియుచున్నది. ఇట్లే అన్ని రాసులయందును చంద్రుని గురించి చూడవలెనని వరాహమిహిరాదుల యభిప్రాయము. శశిని = చంద్రుడు, నవాంశేషు = మేషాది నవాంశలయందున్నవాడై, సూర్యాద్యైః సూర్యుడు మొదలయిన గ్రహములచేత, అవలోకితే సతి = చూడబడుచుండగా అతః = ఈ ముందర శ్లోకములందు చెప్పబడినట్లు, పైన చెప్పిన ప్రకారమే, విజ్ఞేయం = తెలియదగినది.

ఇట్లు——

శ్లో. "ఆరక్షకో వధరుచిః కుశలో నియుద్ధే
భూపోర్థవాన్ కలహకృత్క్షితిజాంశసంస్థే ॥

మూర్ఖోన్యదారనిరతస్సుకవిస్సితాంశే
సత్కావ్యకృత్సుఖపరోన్యకళత్రగశ్చ॥

శ్లో॥ బాధే హి రంగచరచోరకవీంద్రమంత్రి
గేయజ్ఞ శిల్పనిపుణాశ్శశిని స్థితేంశే।
స్వాంశేల్పగాత్ర ధనలుబ్ధతపస్విముఖ్య
స్త్రీపోష్యకృత్యనిరతాశ్చ నిరీక్ష్యమాణే॥

శ్లో॥ సక్రోధో నరపతిసమ్మతో నిధీశ
స్సింహాంశే ప్రభురసుతోతిహింస్రకర్మా ।
జైవాంశే ప్రథితబలో రణోపదేష్టా
హాస్యజ్ఞస్స చివవికామవృద్ధశీలః॥

శ్లో॥ అల్పాపత్యో దుఃఖితస్సత్యపి స్వే
మానాసక్తః కర్మణి స్వే సురక్తః ।
దుష్టస్త్రీష్టః క్రోధనశ్చార్కభాగే
చంద్రే భానౌ తద్వదింద్వాదిదృష్టే ॥

పై నాలుగు శ్లోకములలోను చంద్రుడు మేషాదిగా ద్వాదశ రాశులందును, మేషాదినవాంశలయం దుండగా సూర్యాదిగ్రహము లచే చూడబడుచున్నప్పుడు పుట్టినవాని స్వభావములను చెప్పినాడు. ఇట్లుచెప్పి వర్గోత్తమాంశమందు చంద్రు డుండగా ఇతరగ్రహములచే చూడబడినచో పైనచెప్పిన ఫలితములకంటె విశేషఫలము నీయ గలడని చెప్పినాడు.

శ్లో॥ వర్గోత్తమస్వపరగేషు శుభం యదుక్తం
తత్పుష్టిమధ్యలఘుతా౽శుభముత్క్రమేణ ।
వీర్యాన్వితోంశకపతిర్నిరుణద్ధి పూర్వం
రాశీక్షణస్య ఫలమంశఫలం దదాతి॥

భావఫలాధ్యాయమున ఉచ్చనీచలనుబట్టి బలము నిర్ణయించి నాడు. ఇందుకు—

శ్లో॥ ఉచ్చత్రికోణస్వసుహృచ్ఛత్రునీచగృహార్కగైః ।
శుభం సంపూర్ణపాదోనదళపాదాల్పవిష్ఫలమ్ ॥

ఈ ఉచ్చాది స్థానములయందున్న గ్రహములచేత నియ్యబడెడి శుభం = శుభఫలము క్రమముగా సంపూర్ణపాదోనదళపాదాల్ప నిష్ఫలముగా చూచుకొనవలెను. అది యెట్లనగా గ్రహకుండలికయందు జెప్పబడిన శుభాశుభఫలములలో శుభఫలమును ఉచ్చయందున్న గ్రహము సంపూర్ణముగా నిచ్చును. మూలత్రికోణమందున్న గ్రహము పాదోన అనగా పాదము తక్కువగా (ముప్పాతి) నిచ్చును. స్వక్షేత్రమందున్న గ్రహము దళ అనగా అర్ధభాగము నిచ్చును. మిత్రక్షేత్రమందున్న గ్రహము పాద అనగా పాతిక భాగమిచ్చును. శత్రుక్షేత్రమునందున్న గ్రహము అల్ప అనగా పాతికకు తక్కువగా నిచ్చును. నీచస్థానగతగ్రహము, అస్తంగత గ్రహమును కొంచెమయినను శుభఫల మియ్యవు అని చెప్పినాడు. ఇచ్చట శుభగ్రహణమువలన అశుభఫలము వ్యుత్క్రమముగా నూహింపదగినది. అది యెట్లనగా అస్తమితగ్రహమును, నీచగ్రహమును అశుభఫలమును సంపూర్ణముగా నిచ్చును. శత్రుక్షేత్రమునందున్న గ్రహము పాతిక అనగా ముప్పాతిక తక్కువగా నిచ్చును. మిత్రక్షేత్రమునందున్న గ్రహము అశుభఫలమును అర్ధభాగము ఇచ్చును. స్వక్షేత్రమందున్న గ్రహము అశుభఫలమును పాతికభాగ మిచ్చును. మూలత్రికోణమునందున్న గ్రహము అత్యంతాల్పఅశుభము నిచ్చును. ఉచ్చయందున్న గ్రహము పాపఫలము కొంచెమయినను ఇవ్వదు. ఈ యభిప్రాయము ఫలితరూపమున ఆశ్రయయోగాధ్యాయమున చెప్పియున్నాడు.

శ్లో॥ కులసమకులముఖ్యముఖ్యబంధుపూజ్యా
ధనిసుఖభోగినృపాస్స్వభైకవృద్ధ్యా ।

పరవిభవసుహృత్స్వబంధుపోష్యా
గణపబలేశనృపాశ్చ మిత్రభేషు॥

స్వభైకవృద్ధ్యా = స్వక్షేత్రములయందున్న గ్రహములు ఏకోత్తర వృద్ధిచేత క్రమముగా కులసమ కులముఖ్య బంధుపూజ్య ధని సుఖ భోగి నృపులగుదురు. అది ఎట్లనగా జన్మకాలమున స్వక్షేత్రములందు ఏదైన నొక గ్రహముండెనేని పుట్టినవాడు స్వకులస్థులలోసమానుడగును. రెండు గ్రహములుండెనేని స్వకులముఖ్యుడగును. 3 గ్రహములుండెనేని బంధుపూజ్యుడగును. 4 గ్రహములుండెనేనిధనికుడగును. 5 గ్రహములుండెనేని సుఖవంతుడగును. 6 గ్రహములుండెనేని రాజభోగములు కలవాడగును. 7 గ్రహములుండెనేని రాజగును. అట్లే మిత్రభేషు = మిత్రక్షేత్రములందు 1 గ్రహమున్న పరవిభవపోష్య=పరాధీనజీవనుడగును. 2 గ్రహములుండెనేని సుహృత్పోష్య=స్నేహితులచేత పోషింపబడువాడగును. 3 గ్రహములుండెనేని స్వపోష్య = జ్ఞాతులచే పోషింపబడువాడగును. 4 గ్రహములుండెనేని బంధుపోష్య = బంధువులచే పోషింపబడు వాడగును. 5 గ్రహములుండెనేని గణప = సమాజాధిపతి యగును. 6 గ్రహములుండెనేని బలేశ = సేనాధిపతి యగును. 7 గ్రహములుండెనేని నృప= రాజగును. ఈ అర్థము చాలమంది వ్యాఖ్యాతలచే చెప్పబడినను అనుభవమును బట్టి చూడగా ఇది వరాహమిహిరుని యభిప్రాయముగా దోచదు. ఇట్లే ఉచ్చగ్రహమును బట్టి యోగమును నిర్ణయించినాడు.

శ్లో॥ జనయతి నృపమేకోప్యుచ్చగో మిత్రదృష్టః
ప్రచురధనసమేతం మిత్రయోగాచ్చ సిద్ధం।
విధనవిసుఖమూఢవ్యాధితాబంధతప్తా
వధదురితసమేతశ్చ్యుతునీచర్క్షగేషు॥

ఒక్క గ్రహమైనను ఉచ్చయందుండి మిత్రగ్రహముచేత గాని, మిత్రక్షేత్రగత గ్రహముచేతగాని చూడబడిన రాజగునని ఈ విధముగా ఇంకా యోగములను వ్రాసియున్నాడు. తరువాత సూర్యచంద్ర హోరలలో నున్న సూర్యాది గ్రహములను బట్టి కూడ స్వభావమును నిర్ణయించినాడు

శ్లో॥ యాతేష్వసత్సుసమభేషు దినేశహోరాం
ఖ్యాతో మహోద్యమబలార్థయుతోఽతితేజాః ।
చాంద్రీం శుభేషు యుజి మార్దవకాంతిసౌఖ్య
సౌభాగ్యధీమధుర వాక్యయుతః ప్రజాతః॥

శ్లో॥ తాస్వేవ హోరాస్వపర ర్క్ష గాసు
జ్ఞేయా నరాః పూర్వగుణేషు మధ్యాః ।
వ్యత్యస్తహోరా భవనస్థితేషు
మర్త్యా భవంత్యుక్తగుణైర్విహీనాః ॥

అట్లే ద్రేక్కాణములను బట్టియును, నవాంశములను బట్టియును "కల్యాణ రూపగుణాత్మ సుహృద్ద్రేక్కాణే చంద్రోన్య గస్తదధివా ధగుణంకరోతి" అనియును చెప్పినాడు. త్రింశాంశలనుబట్టి కూడా ఈవిధముగా స్వభావ నిర్ణయము చేసినాడు.

శ్లో॥ స్వర్క్ష తుంగమూల త్రికోణగాః కంటకేషు యావంత ఆశ్రితాః ।
సర్వ ఏవ తేన్యోన్యకారకాః కర్మగస్తు తేషాం విశేషతః।

ఈ ప్రకీర్ణాధ్యాయమున పై విధముగా ఉచ్చ స్వక్షేత్రమూల త్రికోణములనుబట్టి మిశ్రఫలములను చెప్పియున్నాడు. నైర్యాణికాధ్యాయమున గూడ

శ్లో॥ ద్వావింశః కధితస్తు కారణం ద్రేక్కాణో నిధనస్య సూరిభిః।
తస్యాధిపతిర్భవోఽపివా నిర్యాణం స్వగుణైః ప్రయచ్ఛతి॥

అనగా ఈ నైర్యాణికాధ్యాయమున 22వ ద్రేక్కాణము నను సరించి మరణము నిర్ణయించవలసినదనియును, ఈ ద్రేక్కాణాధిపతి ఏ ధాతువునకు కారకుడో వానికి సంబంధించిన ధాతువుయొక్క ప్రకోపము వలనగాని, వానికి నిర్ణయించబడిన రోగమువలనగాని మరణించునని చెప్పియున్నాడు.

ఈయన ద్రేక్కాణాధ్యాయమును వేరుగా వ్రాసి ద్రేక్కాణములనుబట్టి ఫలితములు వ్రాసియున్నాడు. బృహజ్జాతకమున వరాహమిహిరుడు ద్రేక్కాణములకిచ్చినంత ప్రాముఖ్యము షడ్వర్గమున మరి ఏ వర్గునకును ఇచ్చియుండలేదని పైన వ్రాసినదానిని బట్టి తెలుసుకొనవచ్చును. ఈయన నవాంశ ద్వాదశాంశములు అచ్చటచ్చట చెప్పినను, స్వక్షేత్ర, ఉచ్చ, మూలత్రికోణ, హోరా, త్రిశాంశ, ద్రేక్కాణములకు ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చినట్లు బృహజ్జాతకమును చదివినవారికి తెలియగలదు. మిత్రగ్రహముల గురించి కూడా అక్కడక్కడ చెప్పియున్నాడు. వారికి షడ్వర్గము కేవలము జన్మకాల లక్షణములు సామాన్య యోగములు కొన్ని రోగవిధానములు తెలుసుకొనుటకు మాత్రమే ఉపయోగించినది. వీరు పై చెప్పిన యోగములు గ్రహబల నిర్ణీతములు కావు. గ్రహబలము ఇదమిత్థమని పారాశర్యములో వలె నిర్ణయించినగాని రాజయోగములను నిర్ణయించుటకు వీలుండదు. అట్లు నిర్ణయించినగాని ఏ గ్రహము ఏ దశలో ఎంతయోగము నిచ్చునో నిర్ణయించి చెప్పుటకు వీలులేదు. ఈ కారణమున వీరి మతమున షడ్వర్గముయొక్క ఉపయోగము చాలా తక్కువయని ఏమాత్రము జ్యోతిషము తెలిసినవారికైనను తెలియగలదు. వీరి పద్ధతి చాల లోపభూయిష్టముగా Defective గా) అనుభవములో కనిపించుచున్నది.

## జైమిని మహర్షి మతము

ఈయన షడ్వర్గమును పూర్తిగా వదలివేసినాడనియే చెప్పవచ్చును. ఉచ్చనీచలకు కూడా అంత ప్రాముఖ్యము నివ్వలేదు. అయినను కొన్ని రాజయోగములను అనేక ఇతర యోగములను నిర్ణయించుటలోను రోగవిషయములందును, కళత్ర, సంతాన విషయములలోను షడ్వర్గ నిర్ణయముతో నవసరములేకుండగనే అద్భుతమైన ప్రజ్ఞా విశేషములను చూపించెను. ఈయన వ్రాసిన చాల యోగములు అనుభవములో చక్కగా జరుగుచున్నవి. జైమినిమహర్షి మతము ఒక్కటే చదివినంతమాత్రమున జాతకము చెప్పుటకు తగిన ప్రజ్ఞ కలుగదన్న మాట వాస్తవమే. అయినను పారాశర్యమతము ఒక్కటే తెలిసినను అనేక రకములగు రాజయోగములు చెప్పుటకు జైమిని మతము అత్యవసరము. అది చదివినగాని చక్కగా అనుభవములో జాతక ఫలితములు చెప్పవీలుండదు. అనగా పారాశర్య జైమిని మతములను క్షుణ్ణముగా జదివి, ఉపయోగమును సరిగా చేయగలిగినప్పుడే జ్యోతిషములోని ప్రజ్ఞ కనిపించును. చెప్పినఫలితములుకూడ చక్కగా జరుగును. పారాశర్యమునకు అనేక ఫల విషయములలో జైమిని మతము చాల సహాయకారియై దోహద మొనర్చినది. కాబట్టి పారాశర్య, జైమిని, వరాహమిహిరాదుల మతములను చక్కగా పరిశీలించి వారి వారి పద్ధతులను ఏ భావములకు ఎట్లు ఉపయోగించిన సరిగా జరుగునో గ్రహించి ఫలితములుచెప్పు జ్యోతిష్కుడు సాధారణముగా ఫలితములు చెప్పుటలో తప్పిపోడు. అట్లుకాక ఏదో ఒక పద్ధతియే నేర్చుకొని అదే సర్వము అనుకొని ఫలితములు చెప్పువారు తరచుగా తప్పిపోవుట సంభవించును. అనుభవములో వీరి ఫలితములు చాలవరకు జరుగకపోవుటకు కారణమిదియే.

వైద్యశాస్త్రమున అనేకా వైద్యులు ప్రత్యేక శారీర భాగములకు సంబంధించిన చికిత్సలయందు అసాధారణ పరిశ్రమ గావించి

ఆయా చికిత్సలయందు గణుతికెక్కినట్లు జ్యోతిశ్శాస్త్రమున గూడ ఆయా మహర్షులు ఆయా భావములను, యోగములను, దీసికొని అసాధారణపరిశ్రమ గావించి అనుభవమునకు సరిపోవునట్లు ఫలితములను చెప్పుటలో మిక్కిలి ప్రసిద్ధినిగాంచియున్నారు. కావున ఆయా మహర్షుల మతములను కూలంకషముగా తెలిసికొనినగాని ఆయాభావములను యోగములను నెట్లు నిర్ణయించగలము ? ఉదాహరణకు పురుషజాతకమును వలె స్త్రీ జాతకమును అన్ని విషయముల లోను ఒకే విధముగా చూడకూడదు. స్త్రీలు చాలభాగము భర్త యందు ఆధారపడియుందురు. సంపాదన విషయములోను, రాజయోగాను భవములోను సౌభాగ్యవిషయమునను, పురుళ్ళు మొదలగు వాటి విషయమునను, అనుభవములోకూడ స్త్రీలకు ప్రత్యేక స్థానము కలదు. ఈ కారణమువలన బుద్ధిమంతులగు మహర్షులు స్త్రీజాతక విషయమును ప్రత్యేకముగా చెప్పినారు. ఇందుకు వరాహమిహిరుడు శ్లో॥ "యద్యత్ఫలం నరభవేఽక్షమమంగనానాం తత్తద్వదేత్ పతిషు వాసకలం విధేయం॥" అని చెప్పినాడు. ఈయభిప్రాయమునే జైమిని "రవిణా స్వకులగుప్తాచ" అని చెప్పినాడు. పారాశర్యమునకూడ స్త్రీ విషయమున" ఫలమంగనానాం ఉదీరితం శౌనక నారదాద్యైః" అనిచెప్పబడినది. వరాహమిహిరాదులు శౌనకుడు నారదుడు, కృష్ణమిశ్రుడు పురుషులకు సంబంధించని అనేక యోగములను స్త్రీలవిషయమున చెప్పియున్నారు. ప్రస్తుతము ఈ గ్రంథములను చదివి స్త్రీ జాతకములను చెప్పు జ్యోతిష్కులు లేరనియే చెప్పవచ్చును. వీరికి ఈ ఉత్సాహముగాని తెలిసికొని ఫలితములను చెప్పి ఆ మహర్షుల యభిప్రాయములను అనుభవములో పెట్టుకొని వారి ఔన్నత్యమును ఆనందించుదామను వాంఛ గాని ఉన్నట్లు కానరాదు. కళత్ర సంతాన విషయములను జైమిని

మతము తెలిసినగాని, సరిగా చెప్పలేము. ఈ మహర్షి చక్కటి అనేక యోగములను పారాశర్యమున లేనివాటిని అనుభవమునకు సరిపడునట్లు వ్రాసియున్నాడు. కళత్ర విషయమై అనేక యోగములును, అనేక రకములగు జబ్బులును ఈమహర్షి వ్రాసినంత చక్కగా మరెవ్వరును వ్రాసి యుండలేదు. కొన్ని రాజయోగములు కూడ అనుభవములో సరిగా సరిపడునట్లు వ్రాసి యున్నాడు. జైమిని వలెనే పారాశర్యమితస్థులు ఆయుర్దాయ విషయము, పీఠిక మీద యోగనిర్ణయము, గ్రహబలము, ఆధిపత్యస్థితి సంబంధమువలన కలుగు బలనిర్ణయము, తత్ప్రయుక్త రాజయోగములు, దశాంతర దశలలో రాజయోగనిర్ణయము, కుజ దోషములు, ద్వాదశభావ నిర్ణయము, తత్ప్రయుక్తములగు అనేక యోగములు, భావఫలములు మున్నగు వాటిని ఎంతో బాగుగా వ్రాసియున్నారు.

## పరాశరమతస్థుడగు కాళిదాసుని సప్త వర్గ బలనిర్ణయము

ఈయన ఉత్తరకాలామృతమున క్షేత్ర, హోరా, ద్రేక్కాణ, సప్తాంశ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశలను సప్తవర్గబలముగా నెంచినాడు. ప్రతి గ్రహమును తానున్న రాశిలో నెంతబలములో నున్నదో ఆ బలమును భిన్నములలో (Fractions) లో చెప్పి మొత్తము బలమును నిర్ణయించియున్నాడు. అట్టి బలముగల్గిన గ్రహము ఆయా ఫలితముల నిచ్చునని ఈయన యభిప్రాయము. మొదటివర్గు క్షేత్రము. అనగా స్వక్షేత్ర మిత్రక్షేత్రములని తెలుసు కొనవలెను. అందువలన దీనికి క్షేత్రబలమనుట సరియయిన పద్ధతి. కాని క్షేత్రబలము నిర్ణయించు నప్పుడు, స్వక్షేత్ర మిత్రక్షేత్ర. శత్రుక్షేత్ర, ఉచ్చమూలత్రికోణములను కలిపి తీసికొనవలెను. ఇది

అంతయును క్షేత్రబలము క్రిందనే వచ్చును. ఉచ్చ అనగా పర మోచ్చ, నీచలని చెప్పుకొనవలెను. ఈపద్ధతి చాలచక్కగను, పరాశరమతస్థులగు సర్వఋషులకు సమ్మతముగను ఉన్నది. ఇదియే కాళిదాసుని అభిప్రాయము. కాని ఈపద్ధతి సర్వఋషి సమ్మతమయిన ఆచరణలో application లో చాలవరకు ప్రస్తుతము తప్పుగా వాడబడుచున్నదని అరంభములోనే చెప్పియున్నాను.

## క్షేత్రబలము

శ్లో. సింహోక్షాజవధూధనుర్ఘరఘటా మూలత్రికోణాభిధాః
కుంభశ్చ క్రమశోరవేః క్రియవృషౌ నక్రాంగనాకర్కటాః।
మీనస్త్రాలిగృహాం చ తుంగభవనం త్రతస్థితే ఖేచరే
వీర్యం రూపమితం త్వనో త్రిచరణా మూలత్రికోణే బలం॥

శ్లో. స్వక్షేత్రేర్ధబలం స్వమిత్రభవనే పాదం త్వధీష్టేర్ధయు
క్చాత్రావష్టిమితం తదర్ధమధిశత్రావష్టమాంశస్సమే।
వక్రీ స్వోచ్చబలస్స వక్రసహితో మధ్యంబలం తుంగభే
వక్రీ నీచబలస్స్వనీచభవనే వక్రీబలం తుంగజం॥

శ్లో. ఉచ్చస్థేన యుతోర్థవీర్యమితిచేన్నీచే తుశూన్యం బలం
మిత్రైః పాపఖగైశ్శుభై రిపుఖగైర్యుక్తోపి చార్థం బలం
ఆశాగ్నష్టక రాస్తిధీషుభనఖా సూర్యాల్లవాస్తుంగంజా
స్తజ్జామిత్రగృహే లవా అపి తథా వీర్యం త్విదం రాశిజమ్॥
(ఉత్తరకాలామృతము)

అనగా ప్రతిగ్రహము తాను ఉచ్చరాశియందుండుట వలన 1 రూపబలము కలదగును. మూలత్రికోణమందున్న 3/4 రూపబలము కలదగును. స్వక్షేత్రమందున్న యెడల 1/2 రూపబలము కలదగును. మిత్రక్షేత్రమందున్నచో 1/4 పాతిక భాగము రూపబలము కల

దగును. అధిమిత్రక్షేత్రమందు 1/8 రూపబలము కలదిగా నెంచుకొనవలెను. శత్రుక్షేత్రమందు 1/16 రూపబలమును చూచుకొనవలెను. అధిశత్రుక్షేత్రమందు 1/32 భాగము రూపబలము కలదగును. సమరాశియందు 1/8 బలము కలదనియు, వక్రగ్రహము 1 రూపబలము కలదనియు, ఉచ్చయందు వక్రించిన శూన్యబలము గలదనియు, నీచయందు వక్రించిన పూర్ణబలము కలదనియును అనగా 1 రూపబలము కలదనియును చెప్పినాడు. ఏగ్రహమయిన ఉచ్చగ్రహముతో కలిసినచో 1/2 రూపబలము కలదగును. అనగా అర్ధబలము. పైనచెప్పిన బలములు శుభగ్రహములయినచో వర్తించును. పాపగ్రహములైనచో వానిలో 1/2 బలమని చెప్పవలెను. ఈ బలవివరములు క్రిందచూపబడినవి.

| | | | |
|---|---|---|---|
| 1 | గ్రహము | ఉచ్చ | 1 రూపము |
| 2 | ,, | మూలత్రికోణము | 3/4 ,, ముప్పాతిక బలము |
| 3 | ,, | స్వక్షేత్రము | 1/2 ,, అర్ధబలము |
| 4 | ,, | మిత్రక్షేత్రము | 1/4 ,, పాతికబలము |
| 5 | ,, | అధిమిత్రక్షేత్రము | 1/8,, ఎనిమిదవవంతు ,, |
| 6 | ,, | సమక్షేత్రము | 1/8,, ,, ,, |
| 7 | ,, | శత్రుక్షేత్రము | 1/16,, పదహారవవంతు ,, |
| 8 | ,, | అధిశత్రుక్షేత్రము | 1/32,, ముప్పదిరెండవవంతు ,, |
| 9 | ,, | వక్రగ్రహము | 1 ,, పూర్ణబలము |
| 10 | ,, | ఉచ్చయందు వక్రము | 0 ,, శూన్యబలము |
| 11 | ,, | నీచయందు వక్రము | 1 ,, పూర్ణబలము |
| 12 | ,, | నీచ (వక్రముండకూడదు) | 0 ,, శూన్యబలము |
| 13 | ,, | ఉచ్చగ్రహముతో కలిసిన | 1/2 ,, అర్ధబలము |

ఇది నైసర్గిక శుభులకును, పాపులకును కూడా సమానంగా చూచుకొనవచ్చును. ఇది సప్తవర్గబలములోనిదగు మొదటి క్షేత్ర బలము, ఇట్లు రవ్యాది సప్తగ్రహములకును క్షేత్రబలము జాతకమున చూచుకొని ఆబలము క్రిందచెప్పబోవు ఇతర షడ్వర్గబలములతో కలుపుకొని మొత్తము బలమెంతో తెల్సుకొని గ్రహబలము పూర్తిగా నిర్ణయించుకొని ఫలితములు చెప్పవలసి యుండును.

స్వక్షేత్రము మూలత్రికోణము ఒక్కటైనప్పుడు గ్రహము స్వక్షేత్ర భాగములలో నున్నదియో లేక మూల త్రికోణభాగము లలో నున్నదియో చూచుకొని వానికి చెప్పిన బలమును తీసుకొన వలెను. ఈ క్షేత్రబలములో ఉచ్చభాగములోనున్న గ్రహమున కున్ను పరమోచ్చభాగములలో నున్న గ్రహమునకున్న భేదము ఏమియును చెప్పి యుండలేదు గాన బలములో భేదమేమియును లేదని తెలియవలెను.

## హోరాబలము

శ్లో॥ అర్కేందోర్విషమేన్యథా సమగృహే హోరేథ ద్రేక్కాణకే
లగ్నేష్వంకగృహేశ్వరాశ్చరగృహేభాగ్యేశ్వరాత్స్యుః స్థిరే।
పుత్రేశాచ్చత ఏవ తు ద్వితనుభే సప్తాంశకాస్త్వోజభే
లగ్నేశాత్సమభే తు సప్తమగృహాచ్చాథో నవాంశాః క్రమాత్॥

శ్లో॥ మేషె సింహగృహే ధనుష్యజనవాంశస్త్వాదిమస్తత్క్రమాత్॥
మీనాంతం భవనాధిపాద్రవిలవేశాస్త్రింశభంశాస్త్వథో
బాణేష్వష్టనగేషవో విషమభే భౌమార్కిసూరీందుజా
శ్శుక్రో వ్యత్యయతస్త ఏవ సమభే స్యాత్సప్తవర్గస్త్వయమ్॥
(ఉత్తర కాలామృతము)

ప్రతి రాశియును రెండు భాగములుగా విభజించిన హోర యగును. అనగా రాశిలో సగమని అర్థము. బేసిరాశిలో మొదటి సమభాగము సూర్యహోరా అనియును, రెండవ భాగము చంద్ర హోర యనియును చెప్పబడినది. అట్లే జన్మరాశి సరి రాశియయినచో మొదటి అర్ధభాగము చంద్రహోర, రెండవ అర్ధభాగము సూర్య హోర యగును. జాతకుని జన్మలగ్నము బేసిరాశియో, సమ రాశియో నిర్ణయించుకొని, ఆ రాశిలో ఎన్ని భాగములు అయిన తరువాత పుట్టినాడో చూచిన ఆ భాగమును బట్టి సూర్యహోరలో పుట్టెనో, చంద్రహోరలో పుట్టెనో తెలియగలదు. అట్లే సూర్యాది గ్రహములనుకూడ చూచుకొని హోరాబలము నిర్ణయించుకొనవలెను అదెట్లనగా ఏగ్రహమయినను జాతకములో ఏ రాశిలో నున్నదియు చూచుకొనవలెను. అది బేసి రాశిలో నున్నయెడల సూర్యహోరతో ప్రారంభము గనుక అది ఆ రాశిలో మొదటి 15 భాగములు అనగా అర్ధభాగములో నున్న యెడల సూర్యహోర యందున్నదని అర్థము. లేక 15 భాగమును దాటి ఉత్తరార్థమున నున్నచో చంద్ర హోరలో నున్నదని అర్థము. అప్పుడు ఆ గ్రహమునకు చంద్రుడు మిత్రుడో శత్రువో తెలుసుకొని వానికి క్షేత్రబలములో చెప్పిన బలము కలిగియున్నాడని చెప్పుకొనవలెను. ఉదాహరణకు—రవి మేషమందు 20 భాగములలో (అనగా భరణి 3వ పాదమందు) నున్నాడనుకొందము. అప్పుడు ఆ మేషము బేసిరాశి గనుక మొదటి 15 భాగములు (పూర్వార్థము) సూర్యహోరయును, ఉత్తరార్థము చంద్రహోరయును అగును. రవి మేషములో 15 భాగ ములు అనగా సగము దాటిపోయినవాడు గనుక చంద్రహోరలో నున్నాడని అర్థము. కాన అప్పుడు సూర్యునికి హోరబల మెంత యనగా రవికి చంద్రుడు అధిమిత్రుడుగాన 1/8 రూపబలము గల వాడని చెప్పుకొనవలెను.

## ద్రేక్కాణ బలము

ద్రేక్కాణ మనగా రాశిలో మూడవ వంతని అర్థము. రాశిని మూడు భాగములుగా చేసినయెడల మూడు ద్రేక్కాణములగును. ఇవి చరరాశ్యాదిగా చూడవలెను. చరరాశికి లగ్న, పంచమ, నవ మాధిపతులును, స్థిరరాశికి నవమ లగ్న పంచమాధిపతులును, ద్విస్వభావరాశికి పంచమ నవమ లగ్నాధిపతులును ద్రేక్కాణాధిపతులగుదురు. అనగా రవి మేషమందుండిన చరరాశి గాన లగ్న పంచమ నవమాధిపతులను బట్టి చూచుకొనవలెను. ఈ రవి 20 భాగములలో నున్నాడు గనుక రెండవ ద్రేక్కాణ మయినది. అప్పుడు పంచమము రవికి స్వక్షేత్రమునకు అర్ధబలముగాన 1/2 రూపబలము ద్రేక్కాణబలము నిర్ణయించుకొనవలెను.

## సప్తాంశ బలము

ఏ గ్రహమయినను తా నేరాశియందుండునో ఆ రాశి బేసిరాసి అయినచో లగ్నము మొదలు ఏడుగ్రిహములు సప్తాంశాధిపతులగుదురు. అది సరిరాశి యయినచో జన్మలగ్న సప్తమ రాశినిబట్టి వరుసగా 7 గ్రహములు అధిపతులగుదురు. మేషమందు రవియుండగా మేషలగ్నమున పుట్టినాడనుకొందము. రవికి మేషము బేసిరాశిరాయటచేత మేషము మొదలు చూచుకొనవలెను. రవి 20 రవి 20 భాగలు భుక్తి అయినాడు గనుక 2/3 అయినది. ఏడు గ్రహములకు 30 భాగములయినచో ఒక్కొక్క గ్రహమునకు 7/30 చా॥ మేషము, వృషభము, మిథునము, నాలుగు రాసులకు 4 2/7 చా॥ 17 1/7 అయినది. 20 భాగలుగనుక అయిదవ రాశి యగు చంద్రుని ఇల్లగు కర్కటకము సప్తాంశరాశి యగుటచే

దీనికి అధిపతి చంద్రుడగును. రవికి చంద్రుడు అధిమిత్రుడు గాన 1/8 రూపబలము సప్తాంశబలముగా రవికి వేసుకొనవలెను. ఈ సప్తాంశబలము కాళిదాసు చెప్పినాడుగాని ప్రస్తుతము మన దేశములో వాడుకలోలేదు. బహుశః ఆతని కాలమున వాడుకలో నుండి యుండవచ్చును, గాన దీనికంత ప్రాముఖ్యము నిచ్చుట అవసరములేదని తోచుచున్నది.

## నవాంశబలము

నవాంశబల మనగా జన్మలగ్నరాశిని 9 భాగములు చేసిన ఒక్కొక్కభాగము నవాంశమగును. గ్రహమున్న రాశిని 9 భాగములుచేసి నవాంశమును తెల్పుకొనవలెను. ఇది ఎట్లు లెక్క చూచుకొనవలెననగా మేష సింహ ధనూరాశులలో నున్నయెడల మేషాదిగాను వృషభ, కన్య, మకరరాశులలో నున్నయెడల మకరాదిగాను, మిథున కుంభ తులలలో నున్నయెడల తులాదిగాను, మీన వృశ్చి కర్కటకములలోనున్న యెడల కర్కటకాదిగాను చూచుకొనవలెను. మేషమందు రవి 20 భాగలు భుక్తియయ్యెననుకొంటిమిగదా! ఒక్కొక్కనవాంశమునకు 3 1/3 భాగలగును. అనగా 20 భాగలకు మేషము మొదలు 6 నవాంశలగును. అనగా కన్య నవాంశమగును అప్పుడు రవికి బుధుడు సముడుగాన రవికి నవాంశబలము ఎనిమిదవవంతు అగును. అనగా 1/8 చూచుకొనవలెను.

## ద్వాదశాంశబలము

ద్వాదశాంశబల మనగా రాశిలో 12 వ భాగమని అర్థము. రాశిలో 30 భాగములు 12 అంశములలో పంచినయెడల ఒక్కొక్క ద్వాదశాంశమునకు 2½ భాగ లగును. ఇది ప్రతి గ్రహమునకు అది ఏరాశియందుండునో ఆ రాశిమొదలు గ్రహాభుక్తి ఘటియలువరకు

పంచినచో ఎన్నవ రాశి యగునో చూచుకొనవలెను. ఇచ్చట రవి మేషమందు 20 భాగాలలో నున్నాడు. అందువలన 8వ ద్వాదశాంశము మేషాదిగా చూచుకొనవలెను. అప్పుడు వృశ్చికము రవికి ద్వాదశాంశమగును. గనుక రవికి కుజుడు మిత్రుడుగాన రవికి ద్వాదశాంశబలము 1/4 వ వంతుగా చూచుకొనవలెను.

## త్రింశాంశబలము

త్రింశాంశమనగా రాశిలో 30 వ వంతని అర్థము. గ్రహ మేరాశియందుండునో చూచుకొని ఆ రాశిలో నా గ్రహమున కెన్ని భాగములు భుక్తి యయినది చూచుకొనవలెను. తరువాత గ్రహమున్న రాశి బేసిరాశి యయినచో మొదటి 5 భాగాలు కుజుడు, తరువాత 5 భాగాలు శని, తరువాత 8 భాగాలు గురుడు, తరువాత 7 భాగాలుబుధుడు, తరువాత 5 భాగాలు శుక్రుడు అధిపతులగుదురు. ఈ ఏదు గ్రహములున్ను ముప్పది భాగాలకును క్రమముగా పై రీతిని అధిపతులు అగుదురు. గ్రహమున్న రాశి సరిరాశి యయినచో వాటిని తల్లక్రిందులుగా చూచుకొనవలెను. అనగా శుక్రునకు మొదటి 5 భాగలు, బుధునకు 7 భాగలు, గురునకు 8 భాగలు శనికి 5 భాగలు, కుజునకు 5 భాగలు అధిపతులగుదురు. ఇచ్చట రవి మేష రాశిలో 20 వ భాగలో నున్నాడు గనుకను, మేషము బేసిరాశి గనుక సవ్యముగా పంచవలెను. మొదటి 5 భాగలు కుజునకు, తరువాత 5 భాగలు శనికి తరువాత 8 భాగలు గురునకు కలిపి18 భాగలయినవి. తరువాత 2 భాగలు బుధుని భాగలలో బడినవి గాన బుధ త్రింశాంశమయినది. కాబట్టి రవికి బుధుడు సముడు గాన రవికి త్రింశాంశబలము 1/8 ఎనిమిదవ వంతుగా చూచుకొనవలెను. ఇది రవికి త్రింశాంశబలము.

పరాశరాదులచే షడ్వర్గబలము మాత్రమే చెప్పబడినది. కాళిదాసు మాత్రము సప్తాంశబలమునుకూడ చేర్చి షడ్వర్గ అనుటకు బదులు సప్తవర్గ అని చెప్పియున్నాడు. ఇచ్చట ఈయన అభిప్రాయము ప్రకారము క్షేత్రబలము వేరనియును, మిగతావి మాత్రమే షడ్వర్గ అనియును తోచుచున్నది. ఈ యభిప్రాయమే చక్కగానున్నది. పై విదముగా బలము నిర్ణయించిన పరువాత ప్రతిగ్రహమునకును ఎన్ని రూపకములు వచ్చినవో చూడవలెను. మొత్తము బలము 8 రూపకములు అని అనుకొనవలెను. అట్టిచో 5 రూపకములు గాని అంతకు ఎక్కువగాని అయినచో ఆ గ్రహము పూర్ణ బలవంతుడనియును, నాలుగు రూపకములు అయినచో అర్ధబలవంతుడనియును, మూడు రూపకములయినచో 3/8 బలవంతుడనియును ఈ విధముగా సప్తవర్గబలము కట్టుకొని ఆయా బలముల ననుసరించి వానికి యోగ నిర్ణయము చేయవచెను.

ఉదా॥ పైనచెప్పిన ప్రకారము రవికి మేషమందు—

| | | రూపకము భాగలు విభాగలు | | |
|---|---|---|---|---|
| (1) | క్షేత్రబలము | 0 - 15 - 0 | 1/2 | బలము |
| | ఉచ్చబలము | 1 - 0 - 0 | | |
| (2) | హోరాబలము | 0 - 3 - 45 | 1/8 | ,, |
| (3) | ద్రేక్కాణబలము | 0 15 - 0 | 1/2 | ,, |
| (4) | సప్తాంశబలము | 0 - 3 - 45 | 1/8 | ,, |
| (5) | నవాంశబలము | 0 - 3 - 45 | 1/8 | ,, |
| (6) | ద్వాదశాంశబలము | 0 - 7 - 30 | 1/4 | ,, |
| (7) | త్రింశాదశబలము | 0 - 3 - 45 | 1/8 | ,, |
| | | 2 - 22 - 30 | | |

ఇచ్చట రవి మేషమందు ఉచ్చలోనుండినను సప్తవర్గబలము కట్టినప్పుడు 3/8 బలముకంటె తగ్గిపోవుటచేత వీని యోగమ్ముగాని అవయోగముగానికి 3/8 మాత్రమే యుండునని గ్రహించి ఆ ప్రకారము వాని ఫలితము చెప్పుకొనవలెను.

ఇక ఈ షడ్వర్గము అనుభవములో ఎవరు ఎట్లు ఉపయోగించినదియును, దీని ఉపయోగము ఫలితములు చెప్పుకొనుటకు ఎంతవరకు సరిపోవును, ఏది ఎట్లు ఉపయోగించిన జాతకమున సరియయిన ఫలితములు చెప్పుకొనుటకు వీలుగా నుండును అను విషయము మున్ముందు వ్రాయుదును.

గ్రహములకు షడ్వర్గబలముకట్టి తద్వారా ఫలితములను నైసర్గికత్వము ఆధిపత్యము స్థితి మొదలగునవి చూడకుండగా చెప్పినచో తప్పక చెప్పినది చాలావరకు తప్పిపోవును. ఇది అనేక జాతకములను పరీక్షించి వ్రాయుచున్నాను. కాబట్టి షడ్వర్గబలమునకు చాలా తక్కువ ఉపయోగము Limited Importance ఇచ్చినచో ఫలితములు సరిగా జరుగును. యోగనిర్ణయమునకు వరాహమిహిరాదుల మతమున హోరా, ద్రేక్కాణ, నవాంశాదులను (ఎట్లు వాడిరో చెప్పియున్నాను. హోరి మతము ప్రకారము షడ్వర్గము జన్మకాల లక్షణాదులను తెలుసుకొనుటకు తప్ప గ్రహబలములను నిర్ణయించి తద్వారా యోగావయోగ నిర్ణయమును చేయుటకు ఉపయోగించదు. కాళిదాసుకూడ బలము నిర్ణయించినాడుగాని రాజయోగనిర్ణయమున దానియుపయోగము ఎక్కడను ఇదమిద్ధమని చెప్పియుండలేదు. స్థానబలముతప్ప ఇతర షడ్వర్గ అనగా హోరా ద్రేక్కాణ, సప్తాంశ, నవాంశ, త్రింశాంశ, ద్వాదశాంశలలో వరాహమిహిరాదులు ఉపయోగించిన పద్ధతే సరియయినదని తోచుచున్నది. వీటి యుపయోగము జ్యోతిషమున ఇతరత్రా అంత ఉన్నట్లు

తోచదు. కాని స్థానబల మట్లుకాదు. నవాంశలగ్నమునుబట్టి నవాంశమందున్న గ్రహములనుబట్టియు కొన్నిరోగములు, కళత్రలక్షణములు, ప్రవర్తన (Character), భార్యప్రవర్తన, రూపము మొదలగు కొన్నివిషయములు మహర్షులచే చెప్పబడినవి గాన నవాంశలగ్నమున్ను, నవాంశలగ్నముననున్న గ్రహములున్ను కొంతవరకు ఇందుకు ఉపయోగపడుచున్నవి. ఉదాహరణకు కళత్రముయొక్క రూపము నిర్ణయించుటకు శ్లో॥ "యేన యుక్తో యేన దృష్టో యదంశే వా స్థితస్స్వయం। దారాధీశస్తు తద్వర్ణం కళత్రం లభతే పుమాన్"॥ అని చెప్పబడినది. అట్లే "కుష్ఠరోగా కువీరాంశే భార్గవాంశే సుపుత్రిణీ। దుర్గుణా రవిజాంశస్థే గుర్వంశేతు పతిప్రియా" అని చెప్పబడినది. ఇంకను "లగ్ననవాంశపతుల్యశరీరః" అని చెప్పబడినది. ఈవిధముగా పారాశర్యమున నవాంశమును నవాంశలగ్నమును ఉపయోగించినారు.

(1) నైసర్గికత్వము (2) ఆధిపత్యము, (3) స్థితి, (4) సంబంధము, (5) దృష్టి, (6) ఉచ్చస్వక్షేత్ర మూలత్రికోణ మిత్రత్వములు షడ్వర్గబలములు, గ్రహములకు బలాబల నిర్ణయమునకున్ను, తద్వారా ఫలనిర్ణయమునకున్ను, ద్వాదశభావ నిర్ణయమునకున్ను కూడ ఈషడ్వర్గములు చాల ఉపయుక్తములు. జాతకభాగమున ఫలనిర్ణయమునకు ఇవి ఆయువుపట్టువంటివి. ఈకారణమువలన మహర్షులు వీటిని ఆధారము చేసికొని ఫలనిర్ణయములు చేసియున్నందున ఈపై యారున్ను షడ్వర్గబలము లనుట శాస్త్రసమ్మతము అని నాయనుభవమున దృఢపడుచున్నది.

దీనినాధారముగ జేసికొని జాతక నారాయణీయ యోగావళీఖండములందు వ్రాయబడినయోగములు ఈ షడ్వర్గబలముల వ్యష్టి సమష్టులవలన (Permutations and combinations వలన) ఎట్లు ఏర్పడినవో పాఠకులు గ్రహింపనగును.

# 1. నైసర్గికత్వము

నైసర్గికత్వము అనగా సహజగుణము. మహర్షులు ప్రతి గ్రహమునకును సహజముగా ఆయాగుణము (Natural qualities) లుండునని నిర్ణయించిరి. ఈగుణములనుబట్టియే గ్రహములు రెండు తరగతులుగా విభజింపబడినవి— (1) నైసర్గిక శుభులనియును, [2] నైసర్గిక పాపులనియును. నైసర్గికశుభులు బుధ, చంద్ర, శుక్ర, గురులు, నైసర్గికపాపులు రవి, కుజ, శని, రాహువులు, వీరి యభిప్రాయమున పైన వ్రాసిన నైసర్గిక శుభగ్రహములు స్వభావము చేత శుభులనియును, వీరి సహజగుణము ఇతర బలముల వలన మార్పు చెందుననియును తెలియుచున్నది. వీటికి వ్యతిరిక్తమగు చెడుస్వభావము కలిగినవారుగాన శన్యాదులు నైసర్గిక పాపులని నిర్ణయించినారు. అనగా పైన చెప్పిన నైసర్గికత్వము ఇతరబలముల వలన మార్పుచెందదగిన దగుటచేతను ఇట్లు చెప్పబడినది. ఈనైసర్గికత్వము సహజమైనను శాశ్వతముగా దానియందుండనవసరములేదు. ఇది ఒక బలము. ఈబలము పైననే ఇతర మార్పులవలన గలిగిన బలములు నిర్ణయించబడినవి. ఈస్వభావగుణముకూడా ఉత్తరోత్తర బలమని మహర్షులచేత చెప్పబడినది. ఇది నైసర్గిక శుభుల విషయము లోను, పాపుల విషయములోనుకూడా వర్తించును. అది ఎట్లనగా రవికి 1/2బలము, కుజునకు 3/4బలము, శనిరాహువులకు పూర్ణ బలము శుభులవిషయములో బుధునకు 1/2 బలము, శుక్రునకు 3/4 గురునకు పూర్ణ బలము, చంద్రుడు శుద్ధ దశమి మొదలు బహుళ పంచమి వరకు గురునితో సమానబలవంతుడు, బహుళపంచమి మొదలుకొని ఏకాదశి వరకున్ను, శుద్ధమున పంచమి మొదలు దశమివరకున్న శుక్రునితో సమానబలవంతుడు. అనగా 3/4 శుభుడు. శుద్ధమున శుద్ధపాడ్యమి ఉత్తరార్ధము మొదలు చవితి పర్యంతమును, బహుళమున ద్వాదశి

మొదలు త్రయోదశి అంతము వరకును బుధునితో సమానుడు అనగా 1/2 అర్థశుభుడు. బహుళచతుర్దశి మొదలు శుద్ధపాడ్యమి పూర్వార్థము వెళ్ళువరకును రవితో సమానబలవంతుడు అనగా 1/2 పాపియగును. ఇది చంద్రునకు నైసర్గికబలము. ఈవిషయము నేను వ్రాసిన యోగావళీ ఖండమున చక్కగా వివరింపబడినది.

సహజముగ బుధుడు గురు శుక్రులవలె శుభుడని చెప్పబడి నను "బుధః పాపయుతః పాపః" అని మహర్షులు చెప్పుటచేత పాపులతో కలిసిన బుధుడు పాపియగును. ఈ నైసర్గిక స్వభావము ఇతర బలముల వలన ఎట్లు మారునో చెప్పెదను.

## 2. ఆధిపత్యము

ఆధిపత్యబలము నైసర్గిక బలముకంటె ఎక్కువది. ఈ ఆధిపత్యము నైసర్గికబలములో మార్పును తీసుకువచ్చును. ఈ మార్పు నైసర్గిక శుభులకున్ను, నైసర్గిక పాపులకున్ను సమానమే. అది ఎట్లనగా నైసర్గికశుభులగు గురు, శుక్ర, బుధ, చంద్రులకు కేంద్రములకు ఆధిపత్యము కలిగినచో వారి నైసర్గిక శుభత్వములో మార్పు కలిగి కేవలము యోగవిషయమున దోషులగుదురు, కేంద్రములు [అనగా జన్మలగ్నాదిగా 1, 4, 7, 10 రాశులు] నైసర్గిక శుభ గ్రహములను పాపులుగా చేయునని చెప్పినప్పుడు, నైసర్గిక పాప గ్రహములను శుభులుగా జేయునన్న విషయము వేరుగా చెప్ప నక్కరలేదు. అనగా కేంద్రాధిపత్యము నైసర్గిక పాపులగు రవి, కుజ, శనులకు శుభమని అర్థము. మొదటి బలము (నైసర్గికత్వము) ఆధిపత్య బలముచే నెట్లు మార్పు చెందుచున్నదో చెప్పుచున్నాను. "కేంద్రాధిపత్య దోషస్తు బలవాన్ గురుశుక్రయోః" అని మహర్షులచే చెప్పబడినది. దీని అర్థము కేంద్రాధిపత్యదోషము నైసర్గిక

శుభులకు పట్టుననియును, ఉత్తరోత్తరముచే ఇది గురుశుక్రుల కెక్కువయనియును అర్థము. ఉదాహరణకు —వృషభమునకు శుక్రునికి కేంద్రాధిపత్యము కలుగును. అట్లే తులకును ధనుర్మీన లగ్నములకును గురునకు కేంద్రాధిపత్యము పట్టును. అట్లే మిథున కన్యాలగ్నములకు బుధునకు కేంద్రాధిపత్యము పట్టును. ఈ ఆధిపత్యబలము స్వతస్సిద్ధమగు నైసర్గికబలము నెట్లు మార్చినది తెలియగలదు. ఇచ్చట ఒక విషయము కలదు. కేంద్రాధిపత్యము నైసర్గిక శుభులకు పాపమని చెప్పగనే, కోణాధిపత్యము నైసర్గిక పాపులకు పాపమని వేరుగా చెప్పనక్కరలేదు. ఇదేవిధముగా నైసర్గిక పాపులకు రవి, కుజ, శనులకు కేంద్రాధిపత్యము శుభమని చెప్పబడుటచేత నైసర్గిక శుభులకు కోణాధిపత్యము శుభమని వేరుగా చెప్పనక్కరలేదు. ఇట్లు శుభరాశులగు కేంద్రకోణములు 6న్ను శుభపాపగ్రహముల మధ్యను పంచబడగా, మిగిలిన 6 రాశులును పాపరాశులగును. కావుననే ఈ కేంద్రకోణేతర రాశులను మహర్షులు పాపరాశులుగా చెప్పినారు. వీటిని పాపరాశులుగా చెప్పుటకు ఇవి నైసర్గిక శుభులకున్ను, నైసర్గిక పాపులకున్ను అధిపత్యముచేత పాపరాశులగుటయే కారణము.

ఈ ఆధిపత్యముకూడ గ్రహములవలెనే ఉత్తరోత్తర బలము కలది. అనగా లగ్నముకంటె చతుర్థము, చతుర్థముకంటె సప్తమము, సప్తమముకంటె దశమము ఉత్తరోత్తరము. అట్లే పంచమముకంటె నవమము. పాపరాశులలోకూడ ద్వితీయముకంటె ఏకాదశమము. ఏకాదశముకంటె ద్వాదశము. ద్వాదశముకంటె షష్ఠము. షష్ఠముకంటె తృతీయము, తృతీయముకంటె అష్టమము బలవత్తరములు, కొందరు తృతీయముకంటె షష్ఠమెక్కువందురు.

# 3. స్థితి

నైసర్గిక శుభులకును, పాపులకునుకూడ నైసర్గికబలము ఆధిపత్యముచేతను మారునని ఆధిపత్య బలములో చెప్పినాను. ఇట్లు ఆధిపత్యమువలన కలిగిన మార్పు తిరిగి స్థితివలన మారును. ఇట్లు కలిగిన మార్పువలన గ్రహముయొక్క బలాబలములను చాలవరకు నిశ్చయింప నగును. దీనివలన జాతకున కెంతయోగము కలుగునో ఈగ్రహము పీఠికమీద ఎంత యోగమునిచ్చునో, దాని దశాంతర దశలు వచ్చినప్పుడెంత యోగము నిచ్చునో చాలవరకు తెలిసిపోవును. అనగా పైన ఉదహరించిన ప్రకారము నైసర్గిక శుభులకు కేంద్రాధిపత్యమువలన పాపత్వము కలుగునని చెప్పితిని. అట్టి పాపత్వమువలన తిరిగి వారు కేంద్రకోణములందున్నచో ఆపాపత్వమునకు బలము సిద్ధించి అవయోగము నిచ్చుటకు బలవంతులగుచున్నారు. కోణములు పాపత్వమున కేంద్రములకంటె తక్కువబలముకలవిగాన అవయోగము కేంద్రములందుండుటకంటె తక్కువ. కాబట్టి పాపత్వమునకు బలాధికులైన నైసర్గిక శుభులు అవయోగము నివ్వకుండ యోగము మాత్రమే ఇవ్వవలసినచో వారు కేంద్రకోణములకు వ్యతిరిక్తస్థానములగు పాపస్థానములందుండవలెను. అప్పుడు వారు ప్రబలమైన రాజయోగము నిచ్చెదరు.

నైసర్గిక పాపగ్రహములు కోణాధిపత్యమువలన వారి నైసర్గిక పాపత్వము మరింత బలవత్తరమై తిరిగి కోణములందున్న ప్రబల పాపులై మిక్కిలి అవయోగము నిత్తురు. ఈ అవయోగము కేంద్రములందున్న తక్కువ. వీరును నైసర్గిక శుభులవలెనే కోణకేంద్రము వ్యతిరిక్తస్థానములగు పాపసానములందున్నచో మంచి రాజయోగము నిచ్చెదరు, నైసర్గిక శుభులు వారికి చెప్పబడిన కోణాధిపత్యము కలవారైనచో శుభులగుదని ఆధిపత్యబలములో చెప్పబడినది.

ఇట్టి శుభబలము కలిగిన నైసర్గిక శుభులు తిరిగి కోణములందుండిన వీరి నైసర్గిక ఆధిపత్య శుభబలము మరింత వృద్ధియై చక్కని రాజ యోగము నిచ్చెదరు. వీరు ఇతర శుభరాసులగు కేంద్రములం దున్నను శుభబలము గలవారై రాజయోగము నిచ్చుచున్నారు. నైసర్గిక పాపులు కేంద్రాధిపత్యమువలన శుభులై శుభయోగ మిచ్చెద రని చెప్పినాను. ఇట్టి శుభబలము గలిగినవారు తిరిగి శుభరాసులగు కేంద్రములందుండుటవలన అత్యంత శుభులై మంచి రాజయోగము నిచ్చెదరు. వీరు పై విధముగా శుభులగుటచేత శుభవ్యతిరిక్తరాసు లందున్నచో అవయోగము నిచ్చెదరు. నైసర్గికశుభులు కేంద్రాధి పతులైనచో నైసర్గిక శుభత్వము పోయి పాపులగుదురనియును, కోణాధిపత్యమువలన శుభులై శుభఫలము నిచ్చెదరనియును చెప్పి నాను. కాని వీరు పాపరాశ్యధిపతులగుచోకూడ శుభులుగానే పరిగ ణింపబడుచున్నారు. అనగా నైసర్గికశుభులు పాపరాసుల కధిపతు లయినను వారికి నైసర్గికముగ నున్న శుభత్వము పోదు. అందు వలన వీరు శుభరాసులగు కేంద్రకోణములం దెక్కడనున్నను మంచి యోగము నిచ్చెదరు. కాని వీరు పాపస్థానములలో నున్నయెడల పాపాధిపత్యబలము వృద్ధియై ద్విగుణీకృతమై నైసర్గికమగు శుభత్వ మును గోలుపోయి పాపఫలము నిత్తురు. ఇంతవరకు మూల సూత్ర ములు వివరించియున్నాను. వీటికి గల అపవాదములను ఆయా సంద ర్భములలో వివరించియున్నాను.

నైసర్గిక పాపులు స్వతః పాపులగుటచేత వారి కాపాపత్వము వృద్ధియై తిరిగి పాపస్థానములందున్నప్పుడు వారు అవయోగము నిచ్చెదరు.

ఈ స్థితిబలము నైసర్గిక, ఆధిపత్య బలములువలెనే ఉత్తరో త్తరబలము కలది. ఇదివరలో చెప్పినట్లు నైసర్గికత్వమువలన ప్రబల

బలముకలవాడు. అధిపత్యదోషమున ఉత్తరోత్తరముచే ప్రబల దోషియగుచో వాడు తిరిగి స్థితివలసకూడ ఉత్తరోత్తరముచే దోషి యయినయెడల ప్రబల అవయోగము చేయును. అనగా గురునకు నైసర్గిక శుభబల మందరికంటెను ఎక్కువ. ఇట్టి బలాధికుడు కేంద్రాధిపతి యయినచో వాని పాపత్వ నిర్ణయమునకు వాడు 1 కంటె 4 న్ను, 4ల్గు కంటె 7 న్ను, 7 కంటె 10న్ని ఎక్కువని తెలియవలెను. ఆధిపత్యము దోషములలో చెప్పబడినదిగాన ఈగురుడు లగ్న చతుర్థ కేంద్రముల కధిపతి యగునప్పుడు ఒక విధ ముగాను, చతుర్థ, సప్తమ కేంద్రముల కధిపతియయినప్పు డొకవిధ ముగాను (అనగా దోషమున కెక్కువగును.) సప్తమ, దశమములకు ఆధిపత్యములు కలిగినప్పు డంతకంటె ఎక్కువగాను, లగ్నరాజ్యముల కధిపతియయినచో ఉత్తరోత్తరములో ప్రబల పాపిగాను అగు చున్నాడు. ఇట్లే గురుడు తిరిగి కేంద్రస్థితి కలిగినప్పుడు మరింత పాప బలముకలిగి అవయోగము చేయునని చెప్పితిమి. ఈ గురుడు తిరిగి లగ్న కేంద్రముకంటె చతుర్థ కేంద్రమునను. చతుర్థ కేంద్రముకంటె సప్తమ కేంద్రమునను అంతకంటెను దశమ కేంద్రమునను ఉత్తరోత్త రముచే పాపాధికుడై అవయోగము నిచ్చునని నిర్ణయించుకొన వలెను. ఇట్లే పాపగ్రహముల విషయములోను చూచుకొనవలెను.

## 4. గ్రహసంబంధ బలము

పైన వ్రాయబడిన మూడు బలములున్ను గ్రహముల పరస్పర సంబంధము వలన తిరిగి మార్పుచెందును. అనగా నైసర్గిక శుభులు ఆధిపత్యముచేత పాపులైనచో తిరిగి కేంద్రములందున్న యెడల అవయోగమని చెప్పితిమి. వీరికి ఈపాపత్వము తగ్గుటకు వ్యతిరిక్త రాశులగు పాపరాశులందుండిన ఆదోషము పోయి శుభులగుదురని

చెప్పినను. ఒకప్పుడు స్థితివల్లనే అట్లుకాక సంబంధముచేత కూడా ఈగ్రహములు యోగమునిచ్చును. అనగా కేంద్రాధిపత్యము పట్టి తిరిగి కేంద్రకోణములందున్న నైసర్గిక శుభులు పాపస్థానము లందుండుటకు బదులు పాపస్థానాధిపతులగు 3, 6, 8, 12 అధిపతులతో కలిసినయెడల కేంద్రాధిపత్యదోషము తగ్గి యోగమునిచ్చుటకు మంచివారగుచున్నారు. అట్లే కోణాధిపత్యదోషము పట్టిన నైసర్గిక పాపులును యోగమునిచ్చుచున్నారు. నైసర్గికశుభులున్నకొన్నిలగ్నములకు నైసర్గిక పాపులతో కలియక పాపాధిపత్యము పట్టి పాపస్థానములందున్న రాజయోగము నిచ్చుచున్నారు. ఉ॥ మకరమునకు ద్వాదశమునందు గురుడు, కర్కటకమునకు ద్వాదశమందు బుధుడు యోగకారకులు. సింహమునకు ద్వాదశమందు గురుడు, తులకు ద్వాదశమందు శుక్రుడు యోగము నిచ్చెదరు. ధనుస్సునకు ద్వాదశమందు చంద్రుడు అట్లే. ఈగ్రహముల కలియకలో నైసర్గిక శుభులు పాపులు అను విచక్షణలేదు. ఉదాహరణమునకు—మిథునమునకు నైసర్గిక పాపియును, అష్టమాధిపతియును అగు శని, సప్తమ రాజ్యాధిపతియగు గురునితో కలియుట రాజయోగము. ఇచ్చట భాగ్యరాజ్యాధిపతులకు అష్టమ లాభాధిపతుల కలియక ఆవయోగమని చెప్పిన పరాశరమతము వర్తించదు. ఇట్లే ఇతర గ్రహముల కలియక కూడా చూచుకొనవలెను. కోణాధిపత్యదోషము పట్టిన నైసర్గికపాపులును, కేంద్రాధిపత్యదోషముపట్టిన నైసర్గిక శుభులును కలిసి పాపస్థానములందుండుట అత్యంత రాజయోగము. అట్లే కోణాధిపత్యము పట్టిన నైసర్గిక శుభులు కేంద్రాధిపత్యము పట్టిన నైసర్గిక పాపులు కలిసి కేంద్రకోణములందుండుట కూడా అత్యంత శుభము. కాళిదాసు వ్రాసిన విపరీత రాజయోగము అనగా 6, 8, 12 అధిపతులు నైసర్గికత్వముతో సంబంధములేకుండగనే తిరిగి 6, 8 12 స్థానములందుండిన రాజయోగము నిచ్చెదరని వ్రాసినది విశేష

యోగము (Exception). వీరందరును కలిసి పై రాసులలో నెక్కడ ఉన్నను పై విపరీత రాజయోగము పట్టును. వీరికలియక కూడా శుభమే. వీటికి ఉదాహరణ యోగావళీ ఖండమున విపులముగా (Permutations & Combinations) శాస్త్ర ప్రకారము ఈయ బడినది. ఇవి అన్నియు అనేక జాతకములను పరిశీలించి వ్రాయబడి నవి. ఆధిపత్యవిషయములోను కలియకలోను శత్రుమిత్రరాశుల ప్రాముఖ్యము చూడనక్కరలేదు. మొత్తము యోగములో 5%తగ్గిం చినను హెచ్చించినను అంత విశేషభేదము కనిపించదు. ఉ॥ సింహ లగ్నమునకుగాని, కుంభలగ్నమునకుగాని శని రవులు కలిసిన ప్రబల రాజయోగము. వీరిలో రవి, శని ఇంటిలోను, శని, రవి యింటిలోను ఉన్నను, ఇవి వీరికి శత్రుస్థానము లయినప్పటికిని ప్రబల రాజ యోగము.

## 5. క్షేత్రబలము – స్వక్షేత్ర, ఉచ్ఛ, మూలత్రికోణ మిత్రత్వములు.

ఈ క్షేత్రబలములో స్వక్షేత్ర, ఉచ్ఛ, మూలత్రికోణ, మిత్ర త్వములు అంతర్భాగములు. స్వక్షేత్రమని చెప్పినప్పుడు శత్రుక్షేత్ర ముల విషయము వేరుగా చెప్పనక్కరలేదు. ఉచ్ఛగురించి చెప్పి నప్పుడు నీచగురించి వేరుగా చెప్పనక్కరలేదు. మిత్రత్వముగురించి చెప్పినప్పుడు శత్రుత్వముగురించి వేరుగా చెప్పనక్కరలేదు.

(1) ఈ అంతర్భాగములలో మొదటిదగు స్వక్షేత్రము గురించి చెప్పుచున్నాను. నైసర్గిక శుభులకు ఆధిపత్యముచే కేంద్రాధిపత్యము కలిగి, స్థితిచే కేంద్రస్థితి కలిగినచో ఆధిపత్య సంబధమగు దోషము పాపస్థితివలన బలవంతమై పాపయోగమునకు బలవంతులని ఇదివరలో చెప్పియున్నాను. అప్పుడు వీరికి అది స్వక్షేత్రమైనచో ఆ దోషము

మరింత ప్రబలమై పూర్తియయిన అవయోగము నిచ్చెదరు. ఈ కారణమువలన "యో యోభావః స్వామిదృష్టో యుతో వా" అని చెప్పిన వాక్యము ఈసందర్భములో వర్తించదు. ఈఅభిప్రాయ మును వ్రాసిన మహర్షులు కేంద్రాధిపత్యము పట్టిన నైసర్గికపాపులను మనస్సులో పెట్టుకొని వ్రాసినారు. ఈ సాంప్రదాయము తెలియక కేంద్రాధిపత్య దోషము పట్టిన నైసర్గిక శుభులకు పై వాక్యమును వర్తింపజేసికొని అనుభవ విరుద్ధఫలములను జెప్పుచు జ్యోతిష్కులు తప్పుదారిని బడుచున్నారు. ఇది అనేక జాతకములు పరీక్షించిన తరువాత వ్రాసిన విషయము నైసర్గికపాపులవిషయములో కేంద్రాధి పత్యశుభము కలిగినప్పుడు ఈ యభిప్రాయము సరిగా జరుగును. ఉ॥ ధనుర్లగ్నమునకు లగ్నవాహనాధిపత్యము పట్టిన గురుడు లగ్న చతుర్థములలోనుండగా అనగా స్వక్షేత్రమునందుండగా యోగము చేయడు సరికదా అవయోగమునకు కూడ కారకుడగును. ఇదే విధముగా కేంద్రాధిపత్య శుభము కలిగిన నైసర్గికపాపులగు రవి, కుజ, శనులు తిరిగి కేంద్రములందుండిన మరింత శుభులై ఎక్కువ శుభయోగము నిచ్చెదరని చెప్పినాను. వీరికివి స్వక్షేత్రములయినచో ఈ యోగము మరింత ప్రబలము. ఉ॥ వృషభమునకు శని దశమ మందున్నచో మంచియోగము. సింహమునకు శని సప్తమమందున్న మంచియోగము, వృషభమునకు శని సప్తమమందును, సింహమునకు రవి సప్తమమందును, లగ్నమందును మంచియోగము నిచ్చెదరు. దీని సాంప్రదాయ మేమనగా నైసర్గికత్వము ఆధిపత్య, స్థితి, సంబంధముల వలన ఎట్లుపాపముగాగాని, శుభముగాగానిమారునో అట్టిపాపత్వము గాని, శుభత్వముగాని స్వక్షేత్రస్థితివలన హెచ్చిమరింతపాపత్వమును గాని, శుభత్వమునుగాని, ఆ గ్రహములకు ఇచ్చును. ఇది శాస్త్ర అనుభవ సాంప్రదాయసిద్ధము. ఒకప్పుడు పాపస్థానములందు పైవిధ ముగా కేంద్రాధిపత్యము లేకున్నను స్వక్షేత్రములందుండిన గ్రహ

ములు ఒకప్పుడు యోగమును, మరొకప్పుడు అవయోగమునిచ్చెదరు. కుంభలగ్నమునకు శనిద్వాదశమందు స్వక్షేత్రముననున్న చెడ్డవాడు కాడు. మకరలగ్నమునకును గురుడు ద్వాదశమందు స్వక్షేత్రమున నున్నను చెడ్డవాడు కాడు. కాని కొంత యోగము తగ్గును. ఇదే విధముగా సింహాలగ్నమునకు స్వక్షేత్రమయిన షష్ఠమందు శనియుండి వాని దశవచ్చినచో అవయోగము చేయును, అట్లే వృషభ వృశ్చిక లగ్నములకు శుక్రుడు స్వక్షేత్రమైన తులయందున్నను అవయోగము చేయును. అట్లేకుంభలగ్నమునకు బుధుడు అష్టమమందు మంచివాడు కాడు. మిథునలగ్నమునకు అష్టమమందు శనియును, మేషలగ్న మునకు అష్టమమందు కుజుడును అట్టివారే. ఇచ్చట "యో యో భావః స్వామిదృష్టో యుతో వా" అనునది పూర్తిగా పట్టనేరదు. కాబట్టి స్వక్షేత్రబలము ఒకప్పుడు అవయోగము చేయుటకున్ను, మరొక్కప్పుడు యోగించుటకును కూడ ఉపయోగపడుచున్నది. స్వక్షేత్రము నైసర్గికశుభులకున్ను, పాపులకున్ను, కూడ మంచిదని పై శ్లోకమునకు అర్థము చెప్పకొనుట పూర్తిగా తప్పు. సాధారణ ముగా జ్యోతిష్కులు గొప్ప పొరపాటు ఇచ్చటనే చేయుచున్నారు. చాలభాగము యోగవిషయమున తప్పు ఫలితములు చెప్పటకు ఇది ముఖ్యకారణము.

(II) ఉచ్చ, మూలత్రికోణములు:- మూలత్రికోణమును స్వక్షేత్ర ములో అంతర్భాగముగా చూచుకొనుటమంచిది. అనగా దీనికి అంత ప్రాముఖ్యము యోగవిషయమున లేదనియే చెప్పవచ్చును. ఉచ్చ విషయమట్లుకాదు. గ్రహములకు యోగనిర్ణయమున, ఉచ్చనీచలకు ప్రాముఖ్యము కలదు. నైసర్గికపాపులకు నీచ యెల్లప్పుడును శుభమని పెద్దలచే చెప్పబడినది. వీరికి యోగమునకు నీచ బలమని అర్థము. నైసర్గికత్వ, ఆధిపత్య, స్థితులవలన నైసర్గికపాపి యోగము ఇచ్చు

నెడల అప్పుడు నీచ కూడ కలిగినచో మరింత చక్కటి రాజయోగము ఇచ్చును. అదేవిధముగా ఆ గ్రహము ఉచ్చలో నున్న యెడల అవయోగము చెప్పవలెను. ఈ నైసర్గికపాపులు ఒకప్పుడు అవయోగము చేయవలసివచ్చినప్పుడు ఉచ్చలోనుండినచో ఈ అవయోగమును మరింత ఎక్కువగా చెప్పుకొనవలెను. వారు నీచలో నున్న యెడల వారు చేయు పాపఫలము తగ్గిపోవును. పాపగ్రహము లన్నియును ఉచ్చయందుండుట అవయోగము. పాపగ్రహము లన్నియును నీచయందుండుట పీఠికమీాద మంచియోగము. దీనినే నీచభంగ రాజయోగమని చెప్పుదురు. కాళిదాసు "పాపాః నీచగతాః" అని యోగవిషయమున చెప్పుటలో ముఖ్యోద్దేశమిదియే. పాపగ్రహములు నీచను పొందినప్పుడు యోగము నిచ్చువారని యాయన యభిప్రాయము. ఇది అనుభవముచే చక్కగా వ్రాయ బడినట్లు తేలుచున్నది. ఉ॥ మకరమునకు కుజుడు సప్తమమందును, మేషమందు శనియును యోగకారకులు. కన్యాలగ్నమునకు ద్వితీయ మున రవియును, ధనుర్లగ్నమునకు ఏకాదశమున రవియును, మేష లగ్నమునకు లగ్నమందు శని, చతుర్థమందు కుజుడును యోగ కారకులు. పాపగ్రహములకు కూడ ఒకప్పుడు ఉచ్చ యోగము నిచ్చుచున్నది. ఇది కొన్ని లగ్నములకు మాత్రమే వర్తించును, ఉ॥ సింహలగ్నమునకు తృతీయమున శని అంత పాపికాదు. ధనుర్ల గ్నమునకు రవితో కలిసిన శని ఏకాదశమందు ఉచ్చస్థుడైయున్నను యోగము చేయును. ఇదేవిధముగా శని వృశ్చికలగ్నమునకు తృతీయ చతుర్థాధిపతియై షష్ఠమందు (మేషమున) నున్నను అవయోగమునకు బదులు కొంతవరకు యోగమునే ఇచ్చును. తులాలగ్నమునకు లగ్న మందు ఉచ్చస్థుడగు శని యోగమునే ఇచ్చును. ఇది నైసర్గిక పాపుల విషయములో మాత్రమే. నైసర్గికశుభుల విషయ మటుకాదు.

నైసర్గికశుభులవిషయములో ఉచ్చనీచలు యోగమనికాని అవయోగమనికాని నైసర్గికపాపులకు చెప్పినట్లు నిర్దిష్టముగా చెప్పగూడదు. ఈ సాంప్రదాయమును మనస్సులో పెట్టుకొనియే కాళిదాసు "పాపాః నీచ గతాః" అని చెప్పి "శుభాః బలయుతాః" అని చెప్పి రెండు అభిప్రాయములను జోడించి చెప్పినాడు. ఈ యభిప్రాయము చక్కగా నున్నది. అనుభవములో సరిపోవుచున్నది. పాపులకు నీచ యోగించునని చెప్పిన కాళిదాసు 'శుభాః బలయుతాః' అని శుభులను గురించి ఉచ్చనీచలతో ప్రమేయము లేకుండ బలవంతులైన శుభులని మాత్రము చెప్పినాడు. ఉచ్చనీచలద్వారా వారు యోగమిత్తురని చెప్పుట సంప్రదాయముగాని, శాస్త్రీయముగాని కాదని ఈయనకు తెలియును. నైసర్గికశుభులు ఒకప్పుడు ఉచ్చయందును, ఒకప్పుడు నీచయందునుకూడ యోగించెదరు. ఒకప్పుడుఉచ్చ నీచల యందుకూడఅవయోగము నిచ్చెదరు. నైసర్గికశుభులు ఆధిపత్య,స్థితి, సంబంధములచేత పాపులైనచోఅప్పుడు ఉచ్చయందును,నీచయందును కూడ అవయోగము నిచ్చెదరు. అట్లే వీరుపై దోషములేక శుభులైనచో వీరిచ్చు యోగము ఉచ్చయందును, నీచయందునుకూడ హెచ్చుగా నుండును. ఈవిషయమై జైమినిమహర్షి చాలాచక్కగా చెప్పినాడు. ఈయన 'ఉచ్చేనీచేతస్మిన్' అని సూత్రము వ్రాసినాడు. ఈ సూత్రమత్యంత గంభీరమైనది. దీని యభిప్రాయము అనేక జాతకములు పరిశీలించిన (Research చేసిన) వారికిగాని తెలియదు. దీనిఅర్థమేమనగా నైసర్గికశుభగ్రహములకు ఉచ్చతోగానినీచతోగాని పనిలేదని. ఇది ఉదాహరణము నిచ్చినగాని సులువుగా బోధపడదు. పైన వ్రాసిన పరాశరమతమును, జైమినిమతమును ఒక్కటే అని నిరూపించుటకు ఉదాహరణల నిచ్చుచున్నాను — ఉచ్చేనీచే తస్మిన్ అని చెప్పినప్పుడు ఈ మహర్షి నైసర్గికశుభులనే మనస్సులో పెట్టు

కొన్నట్లు అనుభవమువలన తెలియుచున్నది. దీనిని నిరూపించుటకు కొన్ని ఉదాహరణముల నిచ్చుచున్నాను. నైసర్గిక శుభగ్రహములు కేంద్రాధిపత్యదోషముపట్టినప్పుడు యోగవిషయమున పాపులగుదురు గాన అట్టివారు ఉచ్చలోనున్నను అవయోగము చేయుదురు. నీచలో నున్నను అవయోగము చేయుదురు. మీనలగ్నమునకు పంచమమగు కర్కటకమున ఉచ్చస్థుడైవ గురుడు యోగము నివ్వడు. కన్యాలగ్నమునకు ఏకాదశమందు ఉచ్చస్థుడగు గురుడు వాని దశలో కూడా యోగమునివ్వడు. మీనలగ్నమునకు ఏకాదశమందు నీచపడిన గురుడు యోగము నివ్వడు. ధనుర్లగ్నమునకు అష్టమమందు ఉచ్చస్థుడైన గురుడు యోగించును. మిథునలగ్నమునకు అష్టమమందు నీచబడిన గురుడు యోగించును. మేషలగ్నమునకు ద్వాదశమందు ఉచ్చస్థుడైన శుక్రుడు యోగించును. అట్లే ధనుర్లగ్నమునకు, తులాలగ్నమునకు దశమ, ద్వాదశములందు నీచపడిన శుక్రుడు యోగించును. మకర లగ్నమునకు భాగ్యమందు ఉచ్చస్థుడగు బుధుడు యోగించును. కర్కటలగ్నమునకు మీనమందు నీచబడిన బుధుడు యోగించును అట్లే బుధుడు ధనుర్లగ్నమునకు దశమకేంద్రమందు ఉచ్చస్థుడైనను అవయోగము చేయును. ఈ లగ్నమునకు చతుర్థమందు నీచపడినను అవయోగము చేయును. అనుభవములో అనేక జాతకములుపరీక్షించి చూచిన తరువాత ఇది సరిగా నున్నట్లు తేలినది. అందువలన ఉచ్చ నీచబలములు పాపులకువలె శుభులకు యోగవయోగ నిర్ణయమునకు ప్రధానములు కావని తేలుచున్నది.

(III) క్షేత్రబలములోనివే యగు మిత్రశత్రుక్షేత్రములు గాని, మిత్రశత్రుగ్రహ సంబంధముగాని యోగనిర్ణయమున స్వల్పముగా పనికివచ్చును. అనగా పైవిధముగా యోగనిర్ణయమయిన పిదప నైసర్గిక శుభులుగాని పాపులుగాని యోగకారకులైనచో మిత్ర

త్వము దానిని మరింత వృద్ధిచేయును. అవి శత్రురాశులయినచో స్వల్పముగా యోగము తగ్గునని చెప్పకొనవలెను. ఇది సుమారు 5% హెచ్చించిన తగ్గించిన సరిపోవును. కాని ఒక ముఖ్య విషయము మాత్రము గమనించతగ్గది. గ్రహములు అవయోగము నిచ్చువారయినప్పుడుమాత్రము వారు శత్రురాశులయందుగాని శత్రుగ్రహములతో కలిసిగాని యున్నయెడల శత్రుభయము మొదలగు బాధలు పెట్టును. వీరు శత్రుస్థానములందుండి అచ్చటనే శత్రుగ్రహములతో కలిసినయెడల ఈపీడ చాల ఎక్కువగా నుండును. ఉదాహరణకు మేషలగ్నమునకు పరస్పర శత్రువులయిన బుధకుజులు తృతీయమందుగాని, షష్ఠమందుగాని, అష్టమమందుగాని కలిసి వీరిదశలలో నేదయినను వచ్చినచో జాతకుడు చాల చిక్కులుపడును. కాని గ్రహములు యోగకారకులై ఒకప్పుడు శత్రుక్షేత్రములందుండినను యోగము చేయును. భావసంబంధమగు శత్రువృద్ధిగాని, శత్రుబాధగాని, రోగముగాని, చిక్కులుగాని అప్పుడప్పుడు కలుగవచ్చును. వీటికిని యోగమునకును ఏమియును సంబంధములేదు. అనగా ధనర్లగ్నమునకు షష్ఠమందు శత్రుక్షేత్రమున గురుడున్నచో ప్రబలమైన రాజయోగము నిచ్చును. కాని అప్పుడప్పుడు శత్రువులవలన బాధగాని, కళత్రమునకు అనారోగ్యముగాని కలుగవచ్చును. అట్లే ఈలగ్నమునకు ద్వాదశమందు బుధుడుండినను ఇదేవిధముగా చెప్పకొనవచ్చును. సింహాలగ్నమునకు అష్టమమందున్న గురునకుగాని, ద్వాదశమందున్న బుధునకుగాని యోగవిషయమున బాధ లేక పోయినను భావసంబంధ దోషములు కలుగును. సింహామునకు బుధుడు లాభాధిపత్యముకూడ కలిగినందున ద్వాదశమందు శత్రుక్షేత్రమున ఉన్నయెడల ఒకప్పుడు శత్రుభయమును ఎక్కువజేయును.

## 6. దృష్టిబలము

దృష్టిబలముకూడా షడ్బలములలో ముఖ్యమయినదిగా చెప్ప బడినది. అనుభవములో పైన చెప్పిన ఆధిపత్య, స్థితి, సంబంధముల కంటె తక్కువబలముకలది అని తోచుచున్నది. కాని దృష్టిబలములో తక్కువయినంత మాత్రమున యిది చూడకుండ యోగముగాని అవయోగముగాని నిర్ణయించకూడదు. నైసర్గిక శుభులకు కేంద్రాధి పత్యము పట్టి తిరిగి కేంద్రస్థితిదోషము కలిగిన అప్పుడు వారికి నైసర్గిక శుభులదృష్టి మరింత అవయోగముగా నెంచవలెను. వీరికి పాపస్థానాధి పతుల దృష్టి ఎల్లప్పుడు మంచిది. దీనివలన వారికి కేంద్రాధిపత్య దోషము కొంతవరకు విరుగుడగును. అనగా కొంతవరకు శుభులై కేవలము అవయోగము చేయక కొంత యోగముకూడా చేయగల రని అనుభవములో తేలుచున్నది. నైసర్గిక పాపులు కేంద్రాధి పతులై, కేంద్రాధిపత్య శుభము కలిగిన ఇతర నైసర్గిక పాపులచే చూడబడిన చక్కటి రాజయోగము నిచ్చెదరు. నైసర్గిక శుభులకు కోణాధిపత్యము పట్టి తిరిగి కోణాధిపత్య శుభము కలిగిన నైసర్గిక శుభులచేగాని, కేంద్రాధిపత్య శుభము కల్గిన నైసర్గిక పాపులచే గాని చూడబడినచో మంచి రాజయోగము నిచ్చెదరు. కోణాధిపత్యము పట్టిన నైసర్గిక పాపులచేగాని, కేంద్రాధిపత్యదోషము పట్టిననైసర్గిక శుభులచేగాని చూడబడినచో తాముచేయు యోగము కొంత తగ్గించెదరు. వీరికి పాపాధిపతుల దృష్టికూడ అంత యోగమునకు మంచిదికాదు. ఉ॥ మిథున కన్యాధనుర్మీనలగ్నములకు గురు బుధులు ఈలగ్నములలోగాని, కోణములందుగాని ఉండి ఒకరి నొకరు చూచు కొన్నయెడల యోగము నివ్వరు. వీరికి కేంద్రాధిపత్యము పట్టిన ఇతర నైసర్గిక పాపుల దృష్టి కొంతవరకు మంచిది. వీరికి కుజశనులు షష్టాష్టమాధిపత్యములు పట్టి చూచినచో మంచి యోగము. అట్లే నైసర్గిక శుభులు, వృశ్చికలగ్నమునకు బుధుడు. తులాలగ్నమునకు

గురుడు కేంద్రాధిపత్య దోషము పట్టిన శుక్ర చంద్రులను చూచిన మంచిది. మకరలగ్నమునకు శుక్ర చంద్రులకు కేంద్రాధిపత్యము పట్టునుగాన వారికి గురుదృష్టి మంచిది. ఇదేవిధముగా మకరలగ్నమునకు శని, కుజులు కేంద్రాధిపత్య శుభులుగాన ఒకరినొకరు చూచుకొన్న శుభము. వీరు కేంద్రములందుండి చూచినచో అత్యంత శుభము. వీరికి గురు శుక్ర చంద్రుల సంబంధము అంత మంచిది కాదు. పాపుడయినను రవితో సంబంధముకూడ చెడుగు. మకరలగ్నమునకు పంచమ కోణాధిపత్యము పట్టిన శుక్రునకున్ను, భాగ్యకోణాధిపత్యము పట్టిన బుధునకున్ను, మేషలగ్నమునకు అట్టి గురువునకును ఒకరినొకరు చూచుకొన్న యోగము నిచ్చెదరు. కాని వీరికి రవిదృష్టి కంటె శనిదృష్టి మంచిది. పరాశమతస్థులగు మహర్షులు షడ్వర్గబలమును యోగవిషయముననే గాక ద్వాదశభావముల నిర్ణయించుటలో గూడా చాల విరివిగా వాడినారు. ఇంతచక్కగాను, అనుభవమునకు సరిపడునట్లుగాను ఇతరమతస్థులగు మహర్షులుగాని, తరువాతవారు గాని వాడలేదనియే చెప్పవచ్చును. ఈ షడ్వర్గబలమును మహర్షులు బలమని చెప్పినది పాపత్వమునకును, శుభత్వమునకును కూడ సమానమనియే అనగా గుణరహితమయిన బలమని (Strength Without Particular quality అర్థము. అనుభవములో అనేక జాతకములను పరీక్షించగా యోగవిషయమునను, ద్వాదశభావ సంబంధమగు ఇతర ఫలితముల విషయమునను కూడా మహర్షులు ఈయభిప్రాయముతోనే చెప్పినట్లు తేలుచున్నది. ఇందుకు ఉదాహరణలను ముందు ఇచ్చెదరు. మహర్షుల యభిప్రాయము. సాంప్రదాయము ఇట్లుండగా — ప్రస్తుతము వాడుకలో ఈయభిప్రాయమును గుర్తించక జ్యోతిష్కులు ఈబలము ఎల్లప్పుడును శుభబలము క్రిందనే చెప్పినట్లు యభిప్రాయపడి అట్లు వాడుచుండుటచేత ఫలితములు సరిగా జరుగుచుండుటలేదు. ఈబలము మహర్షుల అభిప్రా

యము ప్రకారము స్వతస్సిద్ధముగా పాపత్వమునకేగాని, శుభత్వము నకేగాని చెందియుండక పోవుటచేత పాపత్వమునకు జేరినప్పుడు పాపబలమును వృద్ధిచేయుటయు, శుభత్వమునకు చేరినప్పుడు శుభత్వమును వృద్ధిజేయుటయు కలుగుచున్నది. యోగవిషయమునచెప్పిన ఈయభిప్రాయము ద్వాదశభావ ఫలితముల నిర్ణయించుటలో గూడ ముఖ్యమని ఈదిగువ ఉదాహరణలవలన పాఠకులు గ్రహింతురుగాక.

# ఉదాహరణలు
## (EXAMPLES)

మేష లగ్నమునకు — లగ్నాధిపత్యము పట్టిన కుజుడు లగ్నమందున్న యెడల అప్పుడు వీనికి స్వక్షేత్రబలము (రాశిబలము) యోగమునకును, లగ్నమునకు చెప్పబడిన భావఫలమునకున్నూ కూడ వర్తించును. కాని ఈ లగ్నమున అష్టమమందు కుజుడున్నచో అది వానికి స్వక్షేత్రమయినను యోగవిషయమున అవయోగ మిచ్చుచునాన్నడు. ఇచ్చట క్షేత్రబలము కుజునకు యోగవిషయమున పాపబలముకలదై పాపయోగమునకు ఉపయోగపడుచున్నది. కాని అష్టమము ఆయుఃస్థానమగుటచేత ఆయుర్భావమునకు శుభుడై ఆయుర్విషయమున శుభము కలుగజేయును. అనగా ఆయుర్వృద్ధికి కారకుడగును.

ఈలగ్నమునకు ధన సప్తమాధిపత్యము పట్టిన శుక్రుడు ధనస్థానమందున్నయెడల ధనభావమునకు మంచివాడు కాని రాజయోగమునకు సామాన్యుడు. కాని సప్తమమందున్న యెడల రాశి బలము అనగా స్వక్షేత్రస్థితి అవయోగమునకు బలము. మేష లగ్నమునకు సప్తమమందున్న శుక్రుడు యోగము నివ్వడు. కాని కళత్రమునకున్నూ, కేంద్రమునందుండి లగ్నమును చూచుకొనుట చేత ఆయుర్దాయమునకున్నూ మంచివాడగుచున్నాడు. అనగా పైన ఉదహరించిన ప్రకారము బలము షడ్వర్గులో యోగమునకును అవ

యోగమునకు కూడ చెప్పకొనవలెననియును, ఒక స్థితిలోనే భావమునకు మంచివాడని చెప్పినంతమాత్రమున యోగమునకు శుభబలము కలవాడగునని చెప్పకూడదనియును అనుభవములో నిర్ణయమగుచున్నది.

వృషభ లగ్నమునకు — శుక్రునకు లగ్న షష్ఠాధిపత్యము పట్టును. అట్టి శుక్రుడు లగ్నమునందుగాని, షష్ఠమందుగాని యున్నచో క్షేత్రబలము కలుగును. ఈ శుక్రునకు కలిగిన క్షేత్రబలము అవయోగమునకే గాని యోగమునకు పనికిరాదు. అనగా లగ్నమందున్నపుడు యోగమునివ్వడు. కాని భావమునకు అనగా ఆయుర్దాయమునకు, శరీరబలమునకు, అంగసౌష్ఠవమునకు, లగ్న భావమునకు చెప్పబడిన ఫలితములకు మంచివాడు. కాని రాజ యోగమునకు మంచివాడు కాదు. అట్లే షష్ఠమందున్నప్పుడు స్థానబలము యోగవిషయమున పనికిరాదు. శత్రువృద్ధికి, రోగమునకు, కళత్రమునకు అనారోగ్యము మొదలగువాటిని వృద్ధిచేయుటకును ఈ క్షేత్రబలము పనికివచ్చును. కాని ఈలగ్నమునకు నైసర్గిక పాపులగు రవి శని కుజులకు క్షేత్రబలము కలిగిన భావమునకు, యోగమునకు కూడా చాలమంచిది. ఇచ్చట క్షేత్రబలము యోగమునకు కూడా ఉపయోగపడుచున్నది.

మిథున లగ్నమునకు — బుధుడు లగ్నమందుగాని, చతుర్థమందుగాని యుండిన క్షేత్రబలము కలవాడగును? కాని ఈ బలము యోగవిషయమునకు చెడును. భావమునకు మంచిది. ఈలగ్నమునకు శుక్రుడు పంచమమందున్నచో వానికి క్షేత్రబలము యోగమునకు మంచిది.

కర్కటక లగ్నమునకు-లగ్నాధిపత్యము పట్టిన చంద్రుడుగాని, తృతీయాధిపత్యము పట్టిన బుధుడుగాని, చతుర్థాధిపత్యము పట్టిన శుక్రుడుగాని, పంచమాధిపత్యము పట్టిన కుజుడుగాని, అష్టమాధి

పత్యము పట్టిన శనిగాని వరుసగా వారి స్వక్షేత్రములగు లగ్న, తృతీయ, చతుర్థ, పంచమ, అష్టమములందు స్వక్షేత్రములలో నుండి క్షేత్రబలము కలవారయినను ఆ స్థానములందున్నప్పుడు తప్పక అవయోగము చేయుచున్నారు. గురుడు భాగ్యాధిపతియయి భాగ్య మందు క్షేత్రబలము కలవాడైనచో యోగము నిచ్చుచున్నాడు. అట్లే అంగారకుడు రాజ్యమందు క్షేత్రబలము కలిగిన మంచి యోగము నిచ్చును. ఈ కుజుడు పంచమ రాజ్యాధిపత్యములు కల్గి నప్పుడు రెండు రాశులను స్వక్షేత్రములే యయినను, పంచమ మందులడినప్పుడు కలిగిన క్షేత్రబలము అవయోగమునకును, రాజ్య మందున్న క్షేత్రబలము యోగమునకును బలముగా నెట్లు పరిణ మించుచున్నదో గ్రహించదగును.

సింహలగ్నమునకు— లగ్నమందు రవి, చతుర్థమందు కుజుడు, సప్తమమందు శని యుండి, క్షేత్రబలము కలవారయినచో ప్రబల రాజయోగము నిచ్చెదరు. కాని రెండాధిపత్యములు కలిగిన కుజ శనులలో భాగ్యమందు కుజుడు, షష్ఠమమందు శనియును, దశమ యందు శుక్రుడును ఉన్నయెడల యోగము చెప్పకూడదు. భాగ్య రాజ్యాధిపతులకు ఈ లగ్నమునకు భాగ్యరాజ్యస్థితి యోగము నివ్వదు. శని షష్ఠయందున్నను అవయోగము చెప్పవలెను. ఇప్పుడు వచ్చిన స్వక్షేత్రం అవయోగము. కాని కీర్తిన్ని, భావసంబంధమగు ఇతర యోగములును బాగుండును.

కన్యాలగ్నమునకు— బుధ,గురులు స్వక్షేత్రమందు ఇతరులతో కలియకుండగా నుండిన యోగమునకు మంచిది కాదు. కాని ఆయు ర్దాయమునకు, ఇతర భావఫలములకు మంచిది. శుక్రునకు మాత్రము స్వక్షేత్రములగు ద్వితీయ భాగ్యములు మంచివి. కాని ద్వితీయము కంటె భాగ్యము తక్కువ. ఈ లగ్నమునకు స్వక్షేత్రములయినను మకర కుంభములు శనికి మంచివి కావు.

తులా లగ్నమునకు లగ్నాష్టమాధిపత్యము పట్టిన శుక్రుడు లగ్నాష్టమములో నెక్కడయినను క్షేత్రబలము కలిగియున్నను యోగవిషయమున మంచివాడు కాడు. అట్లే పంచమమందు శని, క్షేత్రబలము కలిగియున్నను. యోగించడు. కాని కుజుడు ద్వితీయ సప్తమములందుగాని. బుధుడు భాగ్యమందుగాని క్షేత్రబలము కల వారయినచో మంచియోగము నిచ్చెదరు. రవి లాభాధిపతియయి లాభమునందున్న భావసంబంధమయిన యోగము నిచ్చునుగాని రాజయోగము స్వయముగా నివ్వలేడు. ఈ లగ్నమునకు క్షేత్రబలము కలిగిన అనగా దశమమందున్న చంద్రుడును యోగమునకంత మంచివాడు కాడు.

వృశ్చిక లగ్నమునకు - నైసర్గిక పాపులగు రవి, కుజ, శనులు క్షేత్రబలము కలవారయినచో యోగము నిచ్చెదరు. శనికి తృతీయము, కుజునకు షష్ఠము చాల తక్కువ. గురునకు కూడ ద్వితీయ పంచమములు మంచివి. శుక్రునకు క్షేత్రబలము అనగా సప్తమ మందుగాని, ద్వాదశ మందుగాని యోగము నివ్వడు. సరికదా అవయోగముకూడా నిచ్చును. బుధుడుకూడా స్వక్షేత్రములందుండి క్షేత్రబలము కలిగినను అవయోగమునకు బలము.

ధనుర్లగ్నమునకు - క్షేత్రబలము కలిగిన గురు, బుధులు, శుక్రుడు అవయోగమునకు బలవంతులు. అట్లే చంద్రుడును అవ యోగము నిచ్చును. రవికి కూడ స్వక్షేత్రమునందు అవయోగమునకు బలము అట్లే కుజుడును అవయోగము నిచ్చును. అనగా ఈ లగ్నము నకు యోగము చేయునప్పుడు క్షేత్రబలము లేకుండుట ఉత్తమమని తెలుచున్నది.

మకర లగ్నమునకు-శనికుజబుధులకు స్వక్షేత్రబలము మంచిది. కాని బుధునకు మిథునము, కుజునకు ఏకాదశము సామాన్యము. గురునకు, రవికి స్వక్షేత్రబలము యోగముకంటె భావమునకు మంచిది.

శుక్ర చంద్రులుకూడ స్వక్షేత్రబలము కలవారయినను దశమమందున్న, సప్తమమందున్న యోగమునివ్వరు. శుక్రుడు పంచమమందు స్వక్షేత్రబలము కలిగినచో యోగమునకు మంచిది.

కుంభ లగ్నమునకు-ఒక్క బుధునకు కన్యయందును శుక్రునకు చతుర్థమందును. కుజునకు తృతీయమందును యోగమునకంటె అవయోగమునకు బలము. ఈ స్థానములు తప్ప ఇతర స్థానములందు క్షేత్రబలము శుభ పాపగ్రహములకు యోగమునకు మంచిది.

మీనలగ్నమునకు- నైసర్గిక శుభగ్రహములగు గురు, శుక్ర, బుధులు క్షేత్రబలము కలవారయినచో యోగము నివ్వరు. కాని శుక్రునకు అష్టమము అట్లుకాదు. నైసర్గిక పాపగ్రహములుకూడ అట్లే. కాని కుజునకు ద్వితీయము, శనికి ఏకాదశము సామాన్యము.

ఈ గ్రంథములో పైన క్షేత్రబలము గురించి కొన్ని ఉదాహరణాల నిచ్చియున్నాను. ఇట్లే కలియక, స్థితి, దృష్టి మొదలగు బలములుకూడ నిర్ణయించుకొనవలెను. ఈ గ్రంథము చదివిన తరువాత నేను వ్రాసిన యోగావళీ ఖండము చదివినచో ఈ బల నిర్ణయముఅవగాహనకలిగి అనుభవములో చక్కగా ఉపయోగించును.

ఇది శ్రీపార్వతీపరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ మౌద్గల్యసగోత్ర పవిత్ర
శ్రీ వాడ్రేవు వంశపయఃపారావార రాకాసుధాకర శ్రీరామ
స్వామీశ్వరార్య పౌత్ర వేంకటరాజామాత్య వెంకట
రత్నమాంబాపుత్ర జ్యోతిషవిద్యాప్రవీణ సూర్య
నారాయణమూర్త్యభిధేయ ప్రణీతంబైన
వచనరూపంబగు షడ్వర్గబల మను
జ్యోతిష గ్రంథము
సంపూర్ణము